# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 161 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 10-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా

# ఇతరుల ప్రమేయం లేకుండా ఆంధ్ర మద్రాసు సమస్యల పరిష్కారం

## సామరస్యంతో జరుపుకొనవచ్చునని మద్రాసు ఆర్థికమంత్రి ఆశయం

### అనంతపురంలో పౌరసన్మానం: భ్రమలు పడవద్దని తమిళ విద్యార్థులకు సలహా

### మద్రాసురాష్ట్రంలో తెలుగువారికి విద్యా సౌకర్యాలు కల్పించాలని సుబ్రహ్మణ్యంకు విజ్ఞప్తి

అనంతపురం, సెప్టెంబరు 8: మరొకరు కలిపించుకుని పరిష్కరించవలసిన అవసరం లేకుండానే, ఇచ్చిపుచ్చుకునే సద్భావంతో ఆంధ్ర, తమిళ సరిహద్దులవంటి సమస్యలను మదరాసు-ఆంధ్ర రాష్ట్రాల ప్రభుత్వాలు పరస్పరంగా సంతృప్తికరంగా పరిష్కరించుకొనగలవని ఆశిస్తున్నానని అనంతపురం పురపాలక సంఘం సమర్పించిన స్వాగతపత్రానికి సమాధానం చెబుతూ మద్రాసు ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం అన్నారు.

అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో చదువుకొంటున్న తమిళ విద్యార్థుల భయాందోళనలను ప్రస్తావించి అవన్నీ కేవలం వారు ఊహించుకుంటున్నవి మాత్రమేనని సుబ్రహ్మణ్యంగారు చెప్పారు.

ఉభయ రాష్ట్రాలమధ్య ఇతోధిక సద్భావ వాతావరణం నెలకొనడానికి కృషిచేయవలసిందిగా ఆంధ్ర ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు విజ్ఞప్తిచేశారు.

శ్రీ గోపాలరెడ్డి, శ్రీ సి. సుబ్రహ్మణ్యం నేటి ఉదయం వచ్చారు. పురపాలకసంఘంతరఫున అధ్యక్షుడు శ్రీ మేడా సుబ్బయ్యశెట్టి వారికి సన్మానపత్రాలు సమర్పించారు.

#### వేరుపడిన తర్వాత మళ్లీ కలవాలని వాంఛ

శ్రీ సుబ్రహ్మణ్యం తన ప్రసంగంలో ఇట్లా అన్నారు: "అవిభక్తరాష్ట్రంలో కంటే యీ నాడు ఈ ఉభయప్రాంతాలలోని ప్రజలమధ్య పరస్పర గౌరవ సుహృద్భావాలు ఎక్కువగా ఉన్నవి. ఈ సంబంధ బాంధవ్యాలు ఇంకా ఎక్కువై ఉభయప్రాంతాలలోని వారూ తిరిగి ఒకే రాష్ట్రంగా కలిసిపోవాలని వాంఛించే రోజు వస్తుందనుకుంటాను. ఈ సామరస్య వాతావరణంలో ఒప్పందం ద్వారా ఎంత చిక్కు సమస్యనైనా సులభంగా పరిష్కరించుకోవచ్చు. పరస్పరవిద్వేష వాతావరణంలో చిన్నచిన్న సమస్యలను పరిష్కరించుకొనటం కూడా కష్టమే అవుతుంది."

#### పరస్పర విశ్వాసం

"పరస్పర సుహృద్భావ సంబంధాలు పెంపొందించుకోవలసిందిగా ఆంధ్రులకూ తమిళులకూ విజ్ఞప్తిచేస్తున్నాను. శతాబ్దాలుగా కలిసిమెలసి ఉంటూ వచ్చిన తమిళులపట్ల మీకు గల వాత్సల్యానికి ఈనాడు మీరు నాకుచేసిన సన్మానం తార్కాణమనుకొంటున్నాను. విభజన సందర్భంలో ఉభయపక్షాలకూ కొంత ఆక్రోశం కలిగినమాట నిజమే. అది సహజంకూడా నేమో. ఈనాడు ఇదంతాపోయి పరిస్థితులు బాగుపడినవి. ఇతరులకు ఆదర్శంగా ఉండేట్లు యీ ఉభయప్రాంతాల మధ్య పరస్పర గౌరవ మర్యాదలున్నవి. పరస్పర సహాయం చేసుకోవాలనే కోరిక ఉన్నది."

"ఇక్కడి ఇంజనీరింగ్ కళాశాలలో చదువుకొంటున్న తమిళ విద్యార్థులు

(4 వ పేజీ చూడుడు)

## ఈజిప్టు ఇజ్రేల్ యుద్ధ విరమణ

### భద్రతా మండలిలో తీర్మానం ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: గాజా ప్రాంతంలో శాంతిని, భద్రతను నెలకొల్పడానికి వెంటనే ప్రయత్నం ప్రారంభించవలసిందిగా ఈజిప్టును, ఇజ్రేల్‌ను కోరుతూ పశ్చిమ రాజ్యాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని సమితి భద్రతా సంఘం నేడు ఏకగ్రీవంగా ఆమోదించింది.

గాజాలో యుద్ధ విరమణ సరిహద్దుకు ఇటు అటూ కొంత భూమిని విడిచిపెట్టి ఈ రెండు దేశాల సైన్యాలకు మధ్య అవరోధంగా వుంచాలని సమితి పాలస్తీనా పర్యవేక్షణ సంఘం అధ్యక్షుడు మేజర్ జనరల్ బరన్స్ చేసిన సూచనను కూడా ఈ సంఘం ఆమోదించింది. ఈ సూచన పశ్చిమ రాజ్యాల తీర్మానంలో పొందుపరచ బడింది.

ఇజ్రేల్ ప్రతినిధి ఎబ్బా ఎబాన్, ఈజిప్టు ప్రతినిధి ఓమార్ లోట్ఫీలు కూడా ఈ తీర్మానాన్ని ఆమోదించారు. సమితి పర్యవేక్షణ సంఘంతో సహకరించి పనిచేయడమే తమ లక్ష్యం అన్నారు. రష్యా ప్రతినిధి ఆర్కాడి సాబొలేవ్ పశ్చిమ రాజ్యాల తీర్మానాన్ని బలపరిచారు.

మేజర్ జనరల్ బరన్స్ చేసిన ఎటువంటి సూచనసైనా సరే ఈజిప్టు ఖచ్చితంగా బలపరుస్తుందని కెయిరో రేడియో కూడా నేడు ప్రకటించింది. అయితే రాజకీయంగా స్వంత లాభంకోసం ఇజ్రేల్ సమాలోచనలు సాగిస్తానంటే మాత్రం అందుకు ఈజిప్టు ఎన్నడూ అంగీకరించదని, అట్టి పనికిమాలిన సమాలోచనలు జరపడం ఈజిప్టుకు ఇష్టంలేదని కూడా ఈ రేడియో విశదం చేసింది.

### భారతీయ చిత్రాలకు గిరాకీ

బొంబాయి, సెప్టెంబరు 8: భారతదేశపు చలన చిత్రాలకు ఆగ్నేయాసియా దేశాలలో మంచి గిరాకీ వున్నదని అఖిల భారత ఎగుమతి వర్తకులసంఘం అధ్యక్షులు శ్రీ చిమూభాయ్, సి. ఝవేరి చెప్పారు.

## గ్రీకుల జోలికి పోనని అట్లాంటిక్ మండలికి టర్కీ విన్నపం

### రెండు రాజ్యాలమధ్యా కలతల పెరుగుదల

పారిస్, సెప్టెంబరు 8: మొన్న మంగళవారంనాడు గ్రీకులకు వ్యతిరేకంగా జరిగిన ఉద్రిక్తచర్యలను, అల్లరులను ఇక తాను ఎంతమాత్రం సాగనీయనని టర్కీ నేడు ఉత్తర అట్లాంటిక్ మండలి సంఘానికి హామీ ఇచ్చింది. ఈ సంఘం ఇవాళ ఉదయం సమావేశమై ఆ సంఘటనలను 1 గంట 15 నిమిషాలు చర్చ చేసింది.

టర్కీ ప్రభుత్వం ఇస్తాంబుల్, అంకారా, ఇజ్మర్‌లలో రాత్రి 11 మొదలు ఉదయం 5 గంటలవరకు కర్ఫ్యూను అమలు పరుస్తున్నది. కతిపయ పట్టణాలలో సైనిక శాసనం అమల్లోకి వచ్చింది, మరి సంబంధమైన సభలు విద్యాలయాలలో పరీక్షలు తప్ప మరో రకంగా జనసమూహం చేరడం గాని, సభ జరపడంగాని నిషేధించబడ్డాయి. సినిమాలు హోటళ్లనుకూడా మూసి వేయిస్తున్నారు.

మంగళవారంనాటి అల్లర్లలో టర్కీ గుంపు గ్రీకుల 54 దేవాలయాలను ధ్వంసం చేసింది. ఇంకా 19 గ్రీకు చర్చిలు వున్నాయి. 57 మంది క్షతగాత్రులయినారు.

టర్కీ ప్రభుత్వం ఈ అల్లర్లలో పాల్గొన్నవారిలో 2 వందల మందికి పైగా ఇజ్మర్‌లో అరెస్టు చేసింది. ఇస్తాంబుల్‌లో 2 వేలమందిని పోలీసులు విచారించారు. అరెస్టు చేసినవారిని విచారణకు పెట్టడానికి ఏర్పాట్లు చేస్తున్నది. ఈ అల్లర్లలో జరిగిన నష్టానికి పరిహారం ఇస్తానని ప్రకటించింది.

అల్లర్ల మూలంగా గ్రీసు, టర్కీ సంబంధాలు చాలావరకు చెడినట్లే కన్పిస్తున్నాయి. వచ్చే సోమవారంనాడు ఇస్తాంబుల్‌లో అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశం జరగవలసి వుంది. ఆ సమావేశానికి తాము హాజరు కాజాలమని గ్రీకులు తెలియజేస్తున్నారు. బాల్కన్ సంధిరాజ్యాలు అంటే టర్కీ, యుగోస్లావియా, గ్రీసుల సైనిక ప్రతినిధుల సమావేశం ఒకటి ఈ నెలలో అంకారాలో జరగవలసివుంది. దానికికూడా తాము హాజరు కామని గ్రీకులు తెలియజేశారు. అందువల్ల ఈ సమావేశమే రద్దయిపోయినట్లు తెలుస్తున్నది. నౌకలను కూడా టర్కీ రేవులకు ప్రస్తుతం పోవద్దని గ్రీకు నౌకల యజమానుల సంఘంవారు ఆదేశించారు.

పరిపాలనా దక్షుడు, ప్రముఖ ఇంజనీరు, పారిశ్రామికవేత్త అయిన శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్యకు, రాష్ట్రపతి సెప్టెంబర్ 7 నాడు 'భారత రత్న' బిరుదును బహూకరించారు.

## గోవా సమస్య జాతీయ ప్రాముఖ్యం కలది

### రాజకీయాలకు అతీతమైనదని శ్రీ ఢేబర్ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: గోవా విమోచనం సమస్య జాతీయ సమస్య అని, పార్టీ రాజకీయాలకు అతీతమైనదని వివరిస్తూ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ఢేబర్ నేడొక ప్రకటన చేశారు.

గోవానుగురించి అఖిల భారత కాంగ్రెసుసంఘం చేసిన తీర్మానాన్ని విమర్శిస్తున్న వారికి సమాధానం ఇస్తూ గోవా సరిహద్దులను మూసివేయడంవల్ల ప్రభుత్వము, ప్రజలు కలిసి పనిచేయవలసిన అవసరం ఏర్పడుతున్నదని, ఇలాటి పరిస్థితులలో సత్యాగ్రహం అసమంజసం అవుతుందని ఆయన అన్నారు.

"ఇప్పుడు మనం ప్రభుత్వాన్ని బలపరచవలసి ఉంది. అట్లా చేస్తేవారు ఈ సమస్య విషయమై ఏకాగ్రమైన చిత్తంతో కృషిచేయ గలుగుతారు. అప్పుడు అంచరం గోవాలో సాగుతున్న విమోచనోద్యమానికి బలీయమైన మద్దత్తును ఇవ్వడం సులభసాధ్యం అవుతుంది. గోవా ప్రజలకు విజయం లభిస్తుంది." అని శ్రీ ఢేబర్ వివరించారు.

#### పార్లమెంటు నిర్ణయం సముచితం

అ॥ భా॥ కాం॥ సంఘ తీర్మానంలో గోవా విమోచనం నిమిత్తం ఏర్పడిన యునైటెడ్ ఫ్రంటును భిన్నం చెయ్యాలన్న ఆలోచనతో కాంగ్రెస్ వ్యవహరించినదని 11 మంది నాయకులు చేసిన ప్రకటనకు శ్రీ ఢేబర్ ఇలా సమాధానం చెప్పారు: మా తీర్మానం వల్ల విమోచనోద్యమానికి, దాని జాతీయ ప్రతిపత్తులకు ఎటువంటినష్టమూ కలగడంలేదు. ఒక్క కార్యక్రమం విషయంలోమాత్రం కాంగ్రెస్ నిర్దుష్టము సహేతుకము అయిన విధానాన్ని అనుసరించవలచుకొని, ఆ తీర్మానంచేసింది. గోవా అంతర్జాతీయమైన సమస్య. ఇటువంటి సమస్యలు ఏర్పడినప్పుడు జాతీయమైన పోరాటాన్ని ప్రభుత్వంద్వారా సాగించడం అన్నది అనాది సిద్ధమైన సంప్రదాయం. ప్రభుత్వ విధానాన్ని పార్లమెంటు అంగీకరించింది. అందువల్ల ఆ విధానాన్ని జాతిఅంతా బలపరచవలసివుంది. కాంగ్రెస్ తన విధానాన్ని ఇతర పార్టీల పద్ధతులతోగూడా సరిపెట్టుకుపోవడానికి అనేకవిధాలుగా కృషిచేసింది. సత్యాగ్రహాన్ని వ్యష్టి

( వ పేజీ చూడుడు)

## గోవా సమస్య అగ్నిపరీక్ష

### శ్రీ మీనన్ వివరణ

బొంబాయి, సెప్టెంబర్ 8: బొంబాయిలో జరిగిన ఒక యువజన మహాసభలో మాట్లాడుతూ, గోవా భారత రాజనీతిజ్ఞతకు అగ్ని పరీక్షగా తయారయిందని, అపరీక్షలో మనం ఇంతవరకు బాగానే నెగ్గుకువచ్చామని శ్రీకృష్ణమీనన్ విశదంచేశారు.

కాంగ్రెసు తీర్మానంపై మాట్లాడుతూ శ్రీ మీనన్ ఇలా అన్నారు: ప్రభుత్వాన్ని, ప్రభుత్వ నాయకులను విమర్శించినంత మాత్రంచేత గోవా సమస్య పరిష్కారం కాదు. మన నాయకులు ధైర్యంతో ఈసమస్యను పరిష్కరించడానికి పూనుకున్న సందర్భంలో ఈవిమర్శ మరీ అనుచితం. అన్ని అంతర్జాతీయ సమస్యలలో వలెనే, గోవా విషయంలో కూడా ఓర్పు అవసరం. ఓర్పు లేమివల్ల సత్ఫలితాలు కలగవు. అన్ని విషయాలను సరిగా అర్థం చేసుకుని వ్యవహరించడం మంచిది" అని సలహా ఇచ్చారు.

#### పౌరులస్వత్వం

గోవన్లు భారతీయులు కారా అన్న ప్రశ్నకు సమాధానం చెబుతూ కాదని ఎవరూ అనడంలేదు గాని, రాజకీయంగా వారిని పరాయివారి క్రిందనే గణించవలసివుంటుందని, అంతర్జాతీయ వ్యవహారాలలో నోటితో భావుకు వ్యవహారం తగదని హెచ్చరించారు." దక్షిణ ఆఫ్రికాలో భారతీయులైనవాళ్లు వున్నారు. అంతమాత్రంచేత వారు భారతదేశం పౌరులవుతున్నారా? గోవా భారతదేశంలో భాగమే. కాని రాజకీయవ్యవస్థలో ఇంకా భాగం కాలేదు. అట్లా లేనంతకాలం భారతదేశం, గోవా ప్రజల సంబంధాలు పౌరసత్వ శాసనాలను బట్టే నడుస్తాయి" అని వివరించారు.

"వలసల వ్యవహారాలలో ఉత్తర అట్లాంటిక్ మండలం చెయ్యి చేసుకుంటుందా?" అని అడుగగా, అటువంటిపని ఎన్నడూ జరగదని శ్రీ మీనన్ జవాబు చెప్పారు. "వలసయుద్ధాల్లో చేతులుకాల్చుకొనేందుకు ఏ దేశంవారూ సిద్ధంగా లేరు. ఇండోచైనాలో కాల్చుకున్నారు; అయిపోయింది. అదే అలాటి యుద్ధాల్లో ఆఖరి యుద్ధమని నేను భావిస్తున్నాను." అన్నారు.

గోవా సత్యాగ్రహం విషయంలో ప్రభుత్వం వైఖరి మారడానికి పాకిస్తాన్‌వారు కాశ్మీరులో సత్యాగ్రహం మొదలు పెడతామని బెదిరించడం ఒక కారణం కాదా అని ప్రశ్నించగా శ్రీ మీనన్ అది సరికాదన్నారు. "పాకిస్తాన్, సత్యాగ్రహం అనేవి వేరువేరు సంగతులు; ఆ రెంటికీ యెప్పుడూ సహవాసం కుదరదు," అన్నారు.

## శ్రీకాకుళం జిల్లాలో పదుల వెల్లువ

### కుంభవర్షం: కాలవలు చెరువులు పొంగి, రోడ్లకు అవరోధం

శ్రీకాకుళం, సెప్టెంబరు 8: ఈ జిల్లాలోని బాహుదా, మహేంద్ర తనయ, వంశధార, నాగావళి నదులకు వరద వచ్చింది. ఈ నదులనుంచి వెళ్ళే కాలవలన్నీ పొంగినవి. 5 వ తేదీనుంచి జిల్లా అంతటా కుంభవర్షం కురుస్తున్నట్లు వార్తలు వస్తున్నవి.

శ్రీకాకుళంలో గత రెండురోజులలోనూ 26 దుక్కుల వాన, జిల్లా మొత్తంమీద సగటున 24 దుక్కుల వాన కురిసింది.

కాలవలు పొంగటంవల్ల చాలా ప్రాంతం మునిగిపోయింది. రోడ్లన్నీ గండ్లుపడినవి. వాన ఇంకా ఇట్లాగే కురిస్తే వ్యవసాయాధారాలైన చెరువులకు గండ్లు పడతవని ఆందోళన పడుతున్నారు.

పోలాకి కాలవకు వరద వచ్చింది అందువల్ల గ్రాండ్ ట్రంక్ రోడ్డుకు గండిపడి నరసన్నపేటనుంచి శ్రీకాకుళం వెళ్లే బస్సుల రాకపోకలు ఆగిపోయినవి. వంశధార, నాగావళి నదులకూ, వాటి కాలవలకూ వరదవచ్చి రోడ్లు పాడైపోయినందున నిన్న మధ్యాహ్నం నుంచి శ్రీకాకుళం-ఆమదాలవలస, శ్రీకాకుళం—పాలకొండ బస్సులు ఆగిపోయినవి.

దూసి, పొలవలస, మాకివలం, పరిబుచ్చిలి మొదలైన గ్రామాలలో పంటచేలు నీళ్ళల్లో మునిగిపోయినవి. జలావృతమైన గ్రామాలు లంకల్లాగా ఉన్నవి. ఆకాశం ఇంకా మేఘావృతంగానే ఉందిగాని వాన కొంచెం వెలిసింది.

## భరణాలు తగ్గించుకోండి

### సంస్థానాధిపతులకు శ్రీ పంత్ హితవు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: తమ భరణాలలో నూటికి 15 వంతులు తగ్గించుకొని, ఆ ధనంలో తాము పాలించిన పూర్వపు సంస్థానాల అభివృద్ధికి దోహదం కల్పించవలసిందని కోరుతూ మాజీ సంస్థానాధిపతులకు భారత హోంశాఖ మంత్రి పండిత పంత్ ఉత్తరాలు వ్రాసినట్లు తెలుస్తున్నది.

ఈ ఉత్తరాలకు ఆ సంస్థానాధిపతులు పంపిన సమాధానాల వివరాలు, అసలు ఈ విషయమై వారి వైఖరులు ఇంకా తెలియరాలేదు.

## జర్మనీ ఏకీకరణ సమస్య

### మాస్కోకు అడెనోవర్ రాక: బుల్గానిన్ స్వాగతం

మాస్కో, సెప్టెంబరు 8: పశ్చిమ జర్మనీ ప్రధాని డాక్టర్ కోన్రాడ్ అడెనోవర్ ఇవ్వాళ వచ్చారు. సోవియట్ నాయకులతో జర్మనీ పునరేకీకరణం మొదలైనవాటిని చర్చిస్తారు. మాస్కో విమానాశ్రయంవద్ద సోవియట్ ప్రధాని మార్షల్ బుల్గానిన్ ప్రభృతులు స్వాగత మిచ్చారు.

అడెనోవర్ తమ రాక రష్యా, జర్మనీలమధ్య మామూలు సత్సంబంధాలు నెలకొనటానికి తోడ్పడగలదని ఆశిస్తున్నామన్నారు. తమ ప్రతినిధివర్గం లక్ష్యం శాంతికి కృషి చేయటమే నన్నారు. ఈ ప్రసంగాన్ని మాస్కో రేడియో ప్రసారం చేసింది.

గోవా ఉద్యమం:

## ప్రభుత్వ చర్యలు చాలును

### కాంగ్రెసు తీర్మానానికి దయ్యూ విముక్తి సంఘ సమర్థన

రాజ్‌కోట్, సెప్టెంబర్ 8: దయ్యూ విముక్తికోసం సత్యాగ్రహం జరుపుతున్న సత్యాగ్రహ సంఘం నేడొక ప్రకటన చేస్తూ గోవాలో భారతీయ సత్యాగ్రహులు ప్రవేశించరాదని అఖిల భారత కాంగ్రెస్ సంఘం చేసిన తీర్మానాన్ని సమర్థించింది. పోర్చుగీస్ వలసలమీద ఆర్థిక ఆంక్షలను విధించటం, భారత ప్రభుత్వం రాజకీయంగా తీసుకునే చర్యలూ పోర్చుగీస్ పాలనను కుంగదీయ గలవన్న నమ్మకాన్ని ప్రకటించింది.

స్వాతంత్ర్యదినంరోజున దయ్యూ స్వాతంత్ర్యోద్యమానికి సౌరాష్ట్ర, గుజరాత్ ప్రజలు చేసిన సహకారానికి కృతజ్ఞత వెల్లడించింది.

భూస్వాములు, దొంగరవాణా వ్యాపారస్థులు మినహా గోవా ప్రజలు యావన్మందీ పోర్చుగీస్ పాలన అంతం కావాలనే కోరుతున్నారని ఇటీవల గోవా వెళ్లి వచ్చిన భారత జాతీయ కళాశాల సంఘం కార్యదర్శి ఓ. సి. మెండెంజ్ నేడు బొంబాయిలో వెల్లడించారు.

#### విమోచన సంఘం నుంచి రాజీనామా

గోవా విమోచనసంఘం బొంబాయి శాఖ సభ్యుడు శ్రీ అప్పా సాహెబ్ ఠాకూర్ నేడు తన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. వెంగుర్ల తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడయిన ఈయన అఖిలభారత కాంగ్రెస్ సంఘ తీర్మానాన్ని పురస్కరించుకుని రాజీనామా చేశారు.

సెప్టెంబర్ 11 వ తేదీన సత్యాగ్రహం జరిపి తీరుతానని ప్రకటించిన ఆచార్యభావే సహోదరుడు గాద్రే గురూజీని బొంబాయి ముఖ్యమంత్రి మొరార్జీ దేశాయ్ సావంత్ వాడీలో కలుసుకోబోతున్నారు. బహుశా ఆయన చేత సత్యాగ్రహోద్దేశాన్ని విరమింపజేయ ప్రయత్నించవచ్చు.

గాద్రే గురూజీ నేటిఉదయం 8 గంటలకు బాండా చేరుకున్నారు. వెంటనే సరిహద్దుల దగ్గరికి వెళ్ళి అక్కడఉన్న పోర్చుగీసు పోలీసులను తాను గవర్నర్ జనరలుకు వ్రాసిన ఉత్తరానికి జవాబు వచ్చిందాఅని అడిగారు. 11 వ తేదీన తాను గోవాలో ప్రవేశిస్తున్నానని ఆయన అందులో తెలియజేశారు. ఉదయం 10-45 వరకు అటువంటి జవాబేమీ రాలేదు.

#### వామపక్షాల సంప్రదింపులు

పూనా, సెప్టెంబర్ 8: గోవా విమోచన సత్యాగ్రహోద్యమాన్ని సమన్వయించి నడిపేనిమిత్తం దేశంలో ఉన్న ప్రధాన వామపక్షాలన్నీ కలిసి ఒక అఖిలభారత సంఘాన్ని ఏర్పాటు చేయాలని ప్రయత్నిస్తున్నవి. కిందటివారం డిల్లీలో ఆచార్య కృపలానీ సమావేశపరిచిన రాజకీయ నాయకుల సభలో ఈ విషయం ప్రస్తావించబడ్డది. గోవా విమోచన సమితి మహారాష్ట్రశాఖ కార్యదర్శి జయంత్ రావ్ తిలక్, మహారాష్ట్ర పి. ఎస్. పి. అధ్యక్షుడు ఎస్. ఎం. జోషి ప్రభృతులు ఈ సమావేశానికి హాజరయినారు.

సత్యాగ్రహుల్ని సరిహద్దులు దాటనివ్వరాదని బొంబాయిప్రభుత్వం జారీ చేసిన ఉత్తరువులను గురించి గోవా

(4 వ పేజీ చూడుడు)

# వైద్యవిజ్ఞానుల చిత్రపటాలు

## గుంటూరు వైద్య కళాశాలలో అవిష్కరణ

గుంటూరు, సెప్టెంబరు 9: నిన్న సాయంకాలం వైద్యకళాశాల పాథాలజీహాలులో కొందరు వైద్యవిజ్ఞాన శాస్త్రవేత్తల చిత్రపటాలను రాష్ట్ర మెడికల్ సర్వీసెస్ డైరక్టరు మేజర్ కె. యస్. రావుగారు అవిష్కరించారు.

ఉత్సవ కార్యక్రమానికి ముందు డైరక్టరు గౌరవార్థం అల్పాహారవిందు జరిగింది. తరువాత గుంటూరు మెడికల్ కాలేజి ప్రిన్సిపాలు డా॥ డి. జగన్నాథరెడ్డిగారు స్వాగతమిచ్చారు. కుమారి సత్యవాణిగారి ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమయింది.

మేజర్ కె. ఎస్. రావు, హెుర్గాగ్ని, ఎడ్వర్డు జెన్నర్, అలెగ్జాండర్ ఫ్లెమింగ్, జాన్‌హోప్కిన్స్ చిత్రపటముల నావిష్కరిస్తూ యింతటి మహనీయులైన శాస్త్రవేత్తల చిత్రపటములయీ వైద్య కళాశాలలో ఉండటం ఎంతో అవసరమని, ఈ నలుగురూ వైద్యశాస్త్రాభివృద్ధికి ఎంతో దోహదంచేసిన మహనీయులని వీరి పటములు విద్యార్థులకే కాక ఉపాధ్యాయులకుకూడా ఉత్సాహము ఉద్రేకము కలిగిస్తాయనడంలో సందేహంలేదని అన్నారు.

అనంతరం డా॥ కె. గోపాలకృష్ణమూర్తి, డా॥ రామచంద్రరావు, డా॥ వి. కె. రెడ్డి, డా॥ సూర్యప్రకాశరావు గారలు, యీ శాస్త్రవేత్తల జీవితవిశేషముల వివరించారు.

రంగమన్నారుగారు వందనసమర్పణ చేశారు.

# పాఠ్యగ్రంథాల ప్రచురణ

## ప్రభుత్వం చేసినా దోషాలు పోవు

కర్నూలు, సెప్టెంబరు 8: ప్రచురణ కర్తలు మారినంతమాత్రాన పాఠ్యపుస్తకాలు బాగుపడవని ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య నిన్న ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణ కళాశాల విద్యార్థుల సభలో మాట్లాడుతూ అన్నారు. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ టి. ఆర్. దీనదయాళ్ అధ్యక్షత వహించారు.

ఇప్పుడు అచ్చు అవుతున్న పాఠ్యపుస్తకాలను పరిశీలించి, ప్రయోగాత్మకంగా, కొన్ని నమూనా పాఠ్యగ్రంథాలు తయారుచేయాలని వెంకటరంగయ్యగారు సూచించారు.

ప్రభుత్వం ప్రచురించినంత మాత్రాన దేశంలో పాఠ్యపుస్తకాలన్నీ ఇప్పటికన్నా మెరుగుగా ఉంటాయనుకోరాదని ఆయన అన్నారు. "ఇప్పటి విధానంలో లోపం, పాఠ్యగ్రంథాలను నిర్ణయించడంలో ఉంది. పుస్తకం ఎవరిచేత వ్రాయిస్తున్నారూ అన్నవిషయం చాలా ముఖ్యం. రేపు ప్రభుత్వం ప్రచురణకు పూనుకున్నా ఆ పుస్తకాలు వ్రాయడానికి గ్రంథకర్తలను ఎన్నుకున్నపుడు, ఇప్పటి పద్ధతే కొనసాగవచ్చు. అలాజరిగితే అసలు దోషం నివారించినట్లుకాదు. లాభాలు ప్రధానంగాగల కర్తలు ప్రచురించడం మాత్రం నేటి అసంతృప్తికర పరిస్థితులకు మూలకారణంకాదు" అని ఆయన అన్నారు.

దీనదయాళ్ గారు మాట్లాడుతూ ఉత్తమ విధానాలలో పాఠ్యపుస్తకాలను తయారుచేయడంలో ప్రభుత్వం, ఉపాధ్యాయుడు, పుస్తక రచయిత పరస్పర సహకారభావంతో కృషిచేయాలన్నారు.

# ఆంధ్ర మద్రాసు సరిహద్దుల చర్చలు ఆగడం అవసరం

## ఫజులాలీసంఘ నివేదిక చేరిన తర్వాత సాగించమని కాశేశ్వరరావు విజ్ఞప్తి

విజయవాడ, సెప్టెంబరు 8: రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణసంఘం తమ నివేదికను త్వరలో ప్రభుత్వానికి పంపించనున్నారని తెలుస్తున్నది, కనుక ఆంధ్ర-తమిళ సరిహద్దులను గురించిన చర్చలను ఇక అపివేయవలసిందిగా ఆంధ్ర మద్రాసు రాష్ట్రాల ప్రభుత్వాలకు విజ్ఞప్తిచేస్తూ విశాలాంధ్రమహాసభ అధ్యక్షుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారొక ప్రకటన చేశారు.

"ఆంధ్ర-తమిళ" సరిహద్దులను గురించి ఈ ఉభయ రాష్ట్రాల మంత్రులమధ్య జరుగుతున్న చర్చలపై చిత్తూరుజిల్లా ఆంధ్రులు చేస్తున్న "సమంజసమైన ఫిర్యాదులను" కాశేశ్వరరావుగారు ఈ ప్రకటనలో ప్రస్తావిస్తూ ఇట్లా అన్నారు: చిత్తూరుజిల్లా పూర్తిగా ఆంధ్ర ప్రాంతమని ప్రభుత్వం గుర్తించారు. నిర్వివాదమైన తెలుగు ప్రాంతమనే కారణాన వ్యా॥ వాంఛూ తమ నివేదికలో చిత్తూరు జిల్లాను ఆంధ్రలో చేర్చారు. 1911 లో చిత్తూరు జిల్లాను ఏర్పాటు చేసినప్పుడు దానికి ఇరుగు పొరుగులో ఉన్న హోసూరు, కృష్ణగిరి, ఆర్కాణం, గుడియాతంవంటి తెలుగు ప్రాంతాలను అందులో చేర్చకపోవడం వల్ల ఆంధ్రులకు జరగవలసినంత న్యాయం జరగలేదు. రెండు తాలూకాల సరిహద్దులను నిర్ణయించే సందర్భంలో కొండలు, నదులవంటి సహజ సరిహద్దులను వెదకడంగాని, ఒక తాలూకాలో చేరవలసిన ప్రాంతమంతా ఒకేఒక నీటివనరుకింద ఉండాలనడంగాని సరైన పద్ధతికాదని నాఅభిప్రాయం. తుంగభద్ర ప్రాజెక్టు రాయలసీమలోని అనేక జిల్లాలకు చాలా అవసరం. కనుక ఆఆనకట్ట నిర్మాణఫలం తమకు రావాలన్న ఆంధ్రుల కోరిక వేరేవిషయం. ఆంధ్రులకు రావలసిన ప్రాంతాలు చాలా ఉన్నవి. వీటితో పోల్చితే ఆర్థిక కారణాల దృష్ట్యా తమకు రావాలని ఆంధ్రులు కోరుతున్న ఆంధ్రేతర ప్రాంతాలు చాలా తక్కువ."

తిరుత్తని విషయం ప్రత్యేకంగా ప్రస్తావించి కాశేశ్వర రావుగారు ఇటా సూచించారు: "తిరుత్తని తాలూకాలోని గ్రామాలలో ఎక్కువభాగం చిత్తూరు జిల్లాలో ఉన్నవి. కనుక అక్కడి ప్రజలలో నూటికి 75 మంది కంటే ఎక్కువమంది తమిళులైతేనూ, కనీసం మూడు వైపులనైనా తమిళ ప్రాంతాలుంటేనూ తప్పతమిళ ఆప్రాంతంలో కలపరాదు.

# అమ్మకంపన్ను విధానం

## మారవలెనని చీరాలసభ తీర్మానం

చీరాల, సెప్టెంబరు 7: అనేకచోట్ల అమ్మకంపన్ను విధించేపద్ధతి రద్దుచేసి, ఒకేచోట వసూలుచేసేపద్ధతి (సింగిల్ పాయింట్) ప్రవేశపెట్టాలని కోరుతూ చీరాలఫిర్కా చిల్లరవర్తకులసభలో నిన్న తీర్మానంచేశారు. ఇందుకు ఉపక్రమణికగా బియ్యం, చక్కెర, తైలాలు, వస్త్రాలు, సిమెంటు మొదలైనవాటిపై ఈ "ఏకస్థానంపన్ను" విధింపువిధానం అమలుజరుపాలనికూడా కోరారు.

సభకు శాసనసభ్యుడు ప్రగడ కోటయ్యగారు అధ్యక్షత వహించారు. జిల్లా చేనేతకాంగ్రెసు అధ్యక్షుడు అక్కల కోటయ్య, రొంపేరు సీటిపారుదల వ్యవహారాలసంఘ కార్యదర్శి వేమవరపు వెంకటేశ్వర్లు, గ్రంధి వీరరాఘవులు ముఖ్యాగారలు, మరికొందరు ప్రత్యేక ఆహ్వానాలపై వచ్చారు.

దోగిపర్తి సుబ్బారావుగారు స్వాగతంచెబుతూ, ఇప్పుడు అమలులోఉన్న "అనేక స్థానపన్ను" పద్ధతివల్ల, చిల్లర వర్తకులు పడుతున్న ఇబ్బందులను వివరించారు. ఈ చిన్నవర్తకులు తమ కొద్ది అదాయంలో కొంతభాగాన్ని పద్దులు వ్రాసిపెట్టే గుమాస్తాలకోసం ఖర్చుపెట్టవలసివస్తున్నదనీ, 'ఏకస్థానం' పన్ను విధిస్తే ఈ ఇబ్బందులు ఉండవనీ అన్నారు.

ప్రగడ కోటయ్యగారు మాట్లాడుతు చిల్లర వర్తకులంతాకలసి కట్టుగా ఆలోచించుకుని, ఈ పన్నుల విషయంలో అనుసరించతగు విధానాలను ప్రభుత్వానికి సూచించాలన్నారు.

తరువాత గ్రంధి వీరరాఘవులు, కామవరపు వెంకటేశ్వర్లు, అక్కల కోటయ్య, పెనుగొండ సుబ్రహ్మణ్యం, చుండూరి వెంకటేశ్వర్లు, గుగ్గిలం నరసింహస్వామి, దివ్వెల రామకృష్ణయ్య, చింతలపూడి బ్రహ్మయ్య, శిద్దా రామారావు, శిఖాకొల్లు రాఘవయ్య గారలు ఉపన్యసించారు.

మిల్లుబట్టల దుకాణాలలో విక్రయించే చేనేత వస్త్రాలపైకూడా అమ్మకంపన్ను రద్దుచేయాలని కోరుతూ ఒక తీర్మానం చేశారు. ప్రభుత్వ పన్ను విధింపు విధానాలు పరిశీలించి, తగు మార్పులు సూచించడానికి ఒక సంఘం నెలకొల్పి, అందులో వర్తకులకు, కొనుగోలు దారులకు ప్రాతినిధ్యం ఇవ్వాలని ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేశారు.

తరువాత చిల్లర వర్తకుల సంఘానికి దోగిపర్తి సుబ్బారావు నంబూరి సీతారామస్వామి గారలను అధ్యక్ష ఉపాధ్యక్షులుగానూ, పెనుగొండ సుబ్రహ్మణ్యం (చీరాల) గారిని కార్యదర్శిగాను ఎన్నుకున్నారు. ఫిర్కాలోని వివిధగ్రామాలకు చెందిన 18 మందిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు. (స్వ. వి.)

# దేశాభివృద్ధి ప్రణాళికలు

## 'విద్యార్థులు అర్థం చేసుకోవాలి'

గుంటూరు, సెప్టెంబరు 8: హిందూ కళాశాల విద్యార్థి సంఘానికి శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య మొన్న ప్రారంభోపన్యాసం ఇచ్చారు. న్యాయమూర్తి శ్రీ పి. సత్యనారాయణరాజు అధ్యక్షత వహించారు.

ప్రార్థనానంతరం శ్రీ వి. రాజగోపాలాచారి స్వాగతమిచ్చారు. ప్రిన్సిపాలు శ్రీ వి. సుబ్బారావు శ్రీ వెంకట రంగయ్య ప్రతిభా విశేషాలు వివరించారు.

శ్రీ వెంకట రంగయ్య ప్రసంగిస్తూ శ్రీ నెహ్రూ పాట్నాప్రసంగం దేశంలో ఉపాధ్యాయులను, విద్యార్థులను, ఎంతో కలవర పెట్టిందన్నారు. విద్యార్థులలో క్రమశిక్షణ లోపిస్తున్నదన్న వాదాన్ని ప్రస్తావిస్తూ ఇలాటి పరిస్థితులకు కారణాలేమిటో ముందు విచారించాలన్నారు. ఆంధ్రలో వివిధ విద్యాసంస్థలతో పరిచయం కలిగించుకునేటందుకు త్వరలో తాము పర్యటించనున్నామని ఇందుకు విద్యార్థుల, ఉపాధ్యాయుల, సహకారం పుంటుగలదని ఆశిస్తున్నామని చెప్పారు. ప్రణాళికా రచనపై మాట్లాడుతూ, ఇవి జయప్రదంగా అమలు జరగాలంటే నియంతృత్వ దేశాలలోనే సాధ్యమవుతున్నదనీ, ప్రజాస్వామిక దేశాలలో ముఖ్యంగా వెనుకబడిన దేశాలలో తగిన అనుభవం, విజ్ఞానంగల నిపుణుల, సహకారం అన్ని రంగాలలోను లభిస్తేనేగాని జయప్రదం కావనీ అన్నారు. ప్రణాళికా రచన అనగా ఏమో అందులో లోపాలేమో విద్యార్థులు అవగాహన చేసుకుని, సరియైన అభివృద్ధి ప్రణాళికల రచనకు మార్గాల న్వేషించాలని కోరారు.

అధ్యక్షులు ప్రసంగిస్తూ గుంటూరు నగరం గొప్ప విద్యావిజ్ఞాన కేంద్రమనీ, విద్యార్థులు ఉత్తమ సంప్రదాయాలు నెలకొల్ప గలరని ఆశిస్తున్నామనీ అన్నారు.

శ్రీ కె. నారాయణరావు వందన సమర్పణ చేశారు. తర్వాత విద్యార్థులు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచారి రచించిన నాటకాన్ని ప్రదర్శించారు.

# బర్మా బియ్యం ధరలు

## రాజ్యసభలో వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: ఇవాళ రాజ్యసభలో బర్మా బియ్యం కొనుగోలుపైన కొంచెం చర్చ రేగింది. కొంతమంది సభ్యులు ఆ బియ్యానికి ఎక్కువ ధర ఇచ్చి, బర్మా మంచితనాన్ని సంపాదించాలని ప్రభుత్వం ప్రయత్నంచేసినదని ఆరోపించగా ఆహారమంత్రి, ఉపమంత్రి గూడా ఆ ఆరోపణలు ఖండించారు.

బర్మాలో పత్రికలు ప్రజలు గూడా బియ్యాన్ని తక్కువ ధరకు భారతదేశానికి అమ్మినారని నిగ్గదీసి అనుగుతూ వున్న సంగతి సభ్యులు గమనించి వుంటే, ఈ రకమైన అనుమానాలు, ఆరోపణలు అసలు పుట్టుకువచ్చేవే కావని శ్రీ కృష్ణప్ప అన్నారు.

బర్మాతో చేసుకున్న ఏర్పాటును వివరిస్తూ ఆహారమంత్రి శ్రీ జైన్, ఆ బేరం జరిగినప్పుడు ప్రపంచ మార్కెట్టులో ఉన్న ధరలనే చెల్లించడానికి ఒప్పందం కుదిరిందని, ఆ అనంతరం బియ్యం ధర తగ్గినమాట నిజమేఅయినా, ఒప్పందం వ్రాసుకున్నాము గనుక దానిని పాలించక తీరని స్థితి ఏర్పడిందని తెలియజేశారు.

బర్మాదగ్గర భారతప్రభుత్వం 9 లక్షల టన్నుల బియ్యం కొన్నది. అందులో 10.2 వేల టన్నులు తప్ప మిగిలిన సరుకు అంతా దిగుమతి అయింది.

# బంగారుగని పనివారి కోర్కెలు

రాబర్టుసన్‌పేట, సెప్టెంబరు 7: ఇటీవల కోలారు బంగారుగనుల యజమానులకు, కార్మికులకు మధ్య జరిగిన ఒప్పందాన్ని అనుసరించి, జీతాల బకాయీలు 1952 సంవత్సరం బోనస్సులు వెంటనే ఇవ్వవలసిందని కోరుతూ, ఛాంపియన్ రీఫ్ బంగారు గనులకు సంబంధించిన సుమారు 5 వేలమంది కార్మికులు ఈవేళ ఉదయం సమ్మెచేశారు.

మైసూరు బంగారుగనులకు సంబంధించిన మరి 5 వేలమంది కార్మికులు ప్రదర్శనలు కూడా జరిపారు. ఈ విషయంలో వెంటనే చర్యతీసుకోబడగలదని కార్మిక నాయకుడు వి. గోవిందన్ హామీ యిచ్చినమీదట వీరు తిరిగి పనిలో ప్రవేశించారు. కార్మికులకు, యజమానులకు మధ్య జరిగిన ఒప్పందం అమలుపరచడానికి యజమానులు సిద్ధంగానే ఉన్నారనీ, యీ విషయంలో ప్రభుత్వం అంగీకారం కోసం ఎదురు చూస్తున్నామనీ యజమానులతరఫున ఒకరు తెలియజేశారు.

# నిజాం రాక పోకల సమస్య

## మంత్రి ప్రకటన

హైదరాబాద్, సెప్టెంబరు 8: హైదరాబాద్ రాజప్రముఖ్ నిజాం నగరవీధులలోకి వచ్చినప్పుడల్లా బండ్లు, మోటారు కార్లు మొదలైనవాటి రాకపోకలను ఆపివేసే అధికారమిచ్చే ప్రత్యేక నిబంధన లేమీలేవని శాసనసభలో రాష్ట్ర హోంశాఖమంత్రి శ్రీ డి. డి. బిందూ ఒక ప్రశ్నకు వ్రాతపూర్వకంగా జవాబు చెప్పారు. అందులో ఇట్లాఉన్నది: "జూలై 14 వ తేదీన రాజప్రముఖ్ వేలం ద్వారా వస్తువులమ్మే ఒక దుకాణానికి వెళ్ళారు. దాని ఎదుట జనం గుమిగూడారు. అప్పుడక్కడి పోలీసు కోరినందున జనం నెమ్మదిగా వెళ్ళారు. రాజప్రముఖ్ అప్పుడక్కడికి వెళ్ళినా మన ప్రయత్నపూర్వకంగా రాకపోకలను పోలీసులు ఆపివేశారనడం నిజంకాదు."

రాష్ట్రంలో ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడకముందు రాజప్రముఖ్ నగర వీధులలోకివస్తే బండ్లు, మోటారు కార్లూ మొదలైనవాటి రాకపోకలను ఆపివేసే పద్ధతి అమలులో ఉండేది.

# న్యూస్‌ప్రింట్ దిగుమతి విధానం

## వాణిజ్య పరిశ్రమలమంత్రి వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 8: వార్తాపత్రికలు ప్రచురించేవారికి మాత్రం, న్యూస్‌ప్రింట్ కాగితాన్ని సరాసరి దిగుమతి చేసుకోడానికి అనుమతులు ఇచ్చేవిధానం అవలంబించడంలో ప్రభుత్వ ఉద్దేశ్యం కాగితం దిగుమతిపై సుంకం ద్వారా వచ్చే ఆదాయం తగ్గిపోకుండా కట్టుదిట్టం చేయడమేనని వాణిజ్యపరిశ్రమల మంత్రి టి. టి. కృష్ణమాచారిగారు ఇవాళ లోక్‌సభలో శ్రీ హెచ్. వి. కామత్ ప్రశ్నకు బదులు చెప్పారు.

న్యూస్‌ప్రింట్ కాగితంపై దిగుమతి సుంకం నూటికి నాలుగురూపాయలు కాగా ముద్రణకు ఉపయోగించే ఇతర కాగితాల దిగుమతిసుంకం నూటికి నలభై అనీ, సుంకం తక్కువకదా అని దేశంలో చాలమంది న్యూస్‌ప్రింట్‌నే వాడడం మొదలుపెట్టారనీ కృష్ణమాచారి గారు చెప్పారు.

సుంకంద్వారా వచ్చే ఈ రాబడి తగ్గిపోకుండా ప్రభుత్వం ఇప్పుడు ఈ కొత్త పద్ధతి ప్రవేశపెట్టింది. దీని ప్రకారం వార్తాపత్రికలవారు మాత్రం తక్కువ సుంకం చెల్లించి న్యూస్‌ప్రింట్ దిగుమతి చేసుకోవచ్చు. ఇతరులు—ఏ కాగితం దిగుమతి చేసుకున్నాసరే (న్యూస్‌ప్రింట్ సహా) నూటికి 40 చొప్పున సుంకం కట్టవలసిందే.

ఈ పద్ధతికి వార్తాపత్రికలు ఆక్షేపణ తెలిపాయా అన్న ప్రశ్నకు జవాబు చెబుతూ మొత్తం 59 పత్రికలు ఆక్షేపణ తెలిపాయనీ, అయితే వాటిలో చాలభాగం నెల, వారపత్రికలేననీ మంత్రి తెలియచేశారు. ఈ పత్రికలు ఆక్షేపణ తెలిపిన ధోరణి చూడగా, ఈ విధానానికి ఉద్వాసన చెప్పించడానికి కొందరు గట్టిగా కృషిచేస్తున్నారని పిస్తున్నట్లు ప్రభుత్వం పసిగట్టగలిగిందనీ, వారిని ఎలా ఎదుర్కోవాలో తెలుసుననీ మంత్రి అన్నారు. ఈ పద్ధతి పెద్ద పత్రికలకేతప్ప చిన్న పత్రికలకు లాభకరం కాజాలదన్న వాదనను ఆయన తిరస్కరించారు.

న్యూస్‌ప్రింట్ కాగితాన్ని ప్రభుత్వమే దిగుమతిచేసే విషయమై ప్రెస్ కమిషన్ చేసిన సిఫార్సు విషయం ప్రభుత్వం ఏంచేసిందని జోచిం అల్వా అడిగారు. వాణిజ్య పరిశ్రమలశాఖకు ప్రెస్‌కమిషన్ సిఫార్సులు ఏవీ తెలియవని మంత్రి జవాబిచ్చారు.

# మందు సామాను పేలి 3 గురి మృతి

## బినా స్టేషన్‌లో దుస్సంఘటన

బొంబాయి, సెప్టెంబరు8: కేంద్రరైల్వే మండలంలోని భోపాల్ - ఝాన్సీ రైలుమార్గంలో బినా కూడలివద్ద ఒక ట్రాలీలో కొన్ని మందుగుండు సామానుల బంగీలను ఒక ప్లాట్‌ఫారం మీద నుంచి మరొక ప్లాట్‌ఫారంమీదికి తీసుకొని వెళుతూండగా కొన్ని మందుగుండు సామానులపెట్టెలు ప్రేలడంవల్ల ముగ్గురు చనిపోయారు. మరి ముగ్గురికి బాగా గాయాలు తగిలినవి. కేంద్ర రైల్వే అధికారులు నిన్న సాయంకాలం చేసిన ప్రకటనవల్ల యీ వివరాలు తెలుస్తున్నవి.

మరి 5 గురికి చిన్నచిన్న గాయాలు తగిలినవి. మెయిన్‌లైన్ ప్లాట్‌ఫారం మీదనుంచి ఒక ట్రాలీలో మొత్తం 8 మందుగుండుసామానులబంగీలను మరొక ప్లాట్‌ఫారంమీదికి ట్రాలీలో తీసుకొని వెళుతూండగా వాటిలో 2 పెట్టెలు ప్రేలడంవల్ల యీ ప్రమాదం జరిగింది. ఆ 8 పెట్టెలలో టపాకీ మందున్నట్లు చెబుతున్నారు. గాయపడిన 6 గురిలో బంగీలను చేరవేసే పోర్టర్లు ముగ్గురూ, లైసెన్సులున్న పోర్టర్లు ఇద్దరూ, రైల్వే పోలీసు ఒకరూ ఉన్నారు. మరి ఐదు గురికి చిన్న చిన్న గాయాలు తగిలినవి.

గాయపడిన వారందరినీ బినాలోని రైల్వే అసుపత్రికి తీసుకువెళ్ళారు. వారిలో ఇద్దరు గతరాత్రిచనిపోయారు.

మరొకరు నేటి ఉదయం చనిపోయారు. మరి ఇద్దరిపరిస్థితి ఆందోళనకరంగా ఉన్నది.

చిన్న గాయాలు తగిలిన 5 గురికి చికిత్సచేసి ఆస్పత్రినుంచి పంపించివేశారు.

ఈ ప్రమాదంగురించి దర్యాప్తుచేయడానికిగాను నాగపూరులోని మందుగుండుసామానులశాఖ ఇన్‌స్పెక్టరు బినా వెళ్ళారు.

# ఉత్తరప్రదేశ్‌లో గోవధ నిషేధచట్టం

లక్నో, సెప్టెంబరు 8: ఉత్తరప్రదేశ్ రాష్ట్రశాసనసభ ఈవేళ గోవధ నిషేధచట్టం ఆమోదించింది.

దీనినిఉల్లంఘించినవారికి 2 సంవత్సరాలవరకు కఠినశిక్షగాని, వెయ్యిరూపాయలవరకు జరిమానాగాని విధిస్తారు. కొన్ని సందర్భాలలో ఈరెండూకూడా విధించవచ్చును. ఈ చట్టంపై 186 సవరణలు వచ్చాయిగాని కొంత చర్చ జరిపినమీదట అన్నీ వీగిపోయాయి.

# దేశంనుంచి పారి పోయిన డా॥ సింగ్

## క్షమార్పణ విధిగా ఇవ్వాలట

ఖట్మండూ, సెప్టంబరు 8: క్షమించవలసిందిగా లిఖితపూర్వకంగా దరఖాస్తు పెట్టుకోవలసిందిగా తిరుగుబాటు దారుల నాయకుడు డా॥ కె. ఐ. సింగ్‌ను నేపాల్ రాజా శ్రీ మహేంద్ర కోరినట్లు నేడు ఇక్కడ తెలుస్తున్నది.

డాక్టరు సింగ్ ప్రస్తుతం చైనీయుల కాపలాలో ఉన్నాడు. విదో లాంఛనంగా క్షమించమని కోరితే యీ విషయం పరిశీలించేదిలేదని శ్రీ మహేంద్ర తెలియచేశారు.

డాక్టరు సింగ్ 1952 లో అప్పటి నేపాల్ రాజా శ్రీ త్రిభువన్ మీద తిరుగుబాటుచేయ యత్నించి విఫలుడై దేశం నుంచి పారిపోయాడు. తిరిగి ఆయన దేశంలోకి రావడానికి ఇటీవలనే అనుమతి లభించింది.

రాజభక్తితో వ్యవహరిస్తాడు. కనుక క్షమించమని టిబెట్ సరిహద్దు గుండా దేశంలోకి రాగానే డాక్టరు సింగ్ నేపాల్ రాజాకు తెలియచేశాడట.

# ప్రభుత్వంచే బంగారు గనుల నిర్వహణ

## లాభంలేదని విమర్శ

బెంగుళూరు, సెప్టెంబరు 8: "కోలారు బంగారుగనులు ప్రభుత్వపరంచెయ్యడంవల్ల మైసూరు ప్రభుత్వానికిగాని, పనివారికిగాని వచ్చే అధికలాభాలేవీ లే"వని కోలారు బంగారుగనుల అధ్యక్షులు శ్రీ ఎమ్. ఎ. శ్రీనివాసన్ అన్నారు.

మైసూరు బ్యాంకు ఉద్యోగుల సంఘానికి ప్రారంభోత్సవం జరుపుతూ శ్రీ శ్రీనివాసన్ ఇలాగన్నారు: "కోలారు బంగారు గనులు ప్రభుత్వపరం చెయ్యాలంటేఒక చట్టంప్రవేశపెట్టాలి. ఈ చట్టం ఎంత సంగ్రహంగా ఉన్నా, నష్టపరిహారంకింద చాలా మొత్తం ఖర్చుపెట్టాలి. చివరికి చట్టం తొందరపడి ప్రవేశపెట్టామే అని పశ్చాత్తాపపడవలసిన పరిస్థితులు ఏర్పడగలవు. పైగా బంగారుగనుల పరిశ్రమ ప్రభుత్వం నిర్వహించే పరిశ్రమలజాబితాలో లేదు. ప్రస్తుతం మైసూరు ముఖ్యమంత్రి శ్రీ హనుమంతయ్య తమ పార్టీకి చెందిన పూర్వపు మంత్రివర్గం బంగారు గనుల విషయంలో చేసిన నిర్ణయాలు తల్లక్రిందులు చెయ్యాలని చూస్తున్నారు. ఇటీవల చాలాదేశాలలో స్వంత ఆస్తిమీద దెబ్బతీసేఉద్యమాలు ప్రారంభించారు. ఇవన్నీ విప్లవప్రమాదాలు నివారించడానికే చేస్తున్నామని అంటున్నారుగాని, చివరికి చర్యలన్నీ విప్లవాలకే దారితీస్తున్నాయి."

# పశ్చిమగోదావరి భూదానోద్యమం

ఏలూరు, సెప్టెంబరు 7: పశ్చిమ గోదావరిజిల్లా పోలవరం తాలూకాలో ఈ క్రిందివారు భూదానోద్యమానికి భూమి దానంచేశారని పశ్చిమ గోదావరిజిల్లా భూదానయజ్ఞ సమితి పంచాలకులు ప్రత్తి శేషయ్య గారు తెలియజేస్తున్నారు.

వలేశా శివరామకృష్ణయ్య పోదులు 25 ఎకరాలు, శ్రీమతి కొనుమిల్లి వెంకటనరసమ్మగారు 25 ఎకరాలు, శ్రీమతి గెడా సత్యవతిగారు 18 ఎకరాలు, వేములపల్లి సత్యనారాయణగారు 5 ఎకరాలు, గెడ్డమగుగుల సత్యనారాయణగారు 10 ఎకరాల 15 సెంట్లు, దాట్రాతి చినవెంకయ్యగారు 5 ఎకరాల 28 సెంట్లు, గోదావరి సత్యనారాయణగారు, 8 ఎకరాల 42 సెంట్లు, కడారి నారాయణమూర్తిగారు 2 ఎకరాలు, గెడా భారయ్యగారు 2 ఎకరాలు, గెడా వెంకటరావుగారు 2 ఎకరాలు, శ్రీమతి దుగ్గిరాల బుల్లెమ్మగారు 1 ఎకరం, పోతురెడ్డిగంగయ్యగారు2 ఎకరాలు, పోతురెడ్డి వీరాస్వామిగారు 2 ఎకరాలు, మద్దిపాటి వెంకన్నగారు 1 ఎకరం, కక్కిరాల సత్యనారాయణగారు 1 ఎకరం, మిరియాల వెంకటరావుగారు 50 సెంట్లు, చామకుర్తి రామారావుగారు 50 సెంట్లు, వద్దూరి అచ్యుతరామారావుగారు 25 సెంట్లు, వద్దూరి కృష్ణమూర్తిగారు 25 సెంట్లు.

# ప్రొద్దుటూరు నీలి మందు సంఘం

ప్రొద్దుటూరు, సెప్టెంబరు 5: స్థానిక నీలిమందు వ్యాపారస్థుల సమావేశం శ్రీ తెల్లం వెంకటయ్యశ్రేష్ఠి అధ్యక్షత న నిన్న జరిగింది.

శ్రీ వంకదార రామస్వామి ప్రసంగిస్తూ నీలిమందు వ్యాపారం ఎలా దెబ్బతింటున్నదో, దీనివలన సామాన్య కుటుంబీకులు ఎలా జీవనాధారం పోగొట్టుకున్నదీ వివరించారు. రైతులు నీలిపంట పండించనందుకు విచారం వెలిబుచ్చారు. అధ్యక్షులు మాట్లాడుతూ పట్టుదల, సహకారంతో, నిస్పృహచెందక, కృషిచేయాలని ప్రోత్సాహించారు. రైతులతో ఐక్యత పెంపొందించుకోవాలని కోరారు.

నీలిమందు ఉత్పత్తి విక్రయసంఘానికి ఈ క్రిందివారిని ఎన్నుకున్నారు: శ్రీ తెల్లం వెంకటయ్యశ్రేష్ఠి అధ్యక్షుడు, శ్రీ వంకదార రామస్వామి కార్యదర్శి, శ్రీయుతులు తెల్లం పెద్ద సుబ్రహ్మణ్యం, జాపూరు సుబ్బయ్య, బురానుదీన్‌గారి ఇమామ్‌దీన్, నిచ్చెనమెట్ల నరప్ప, దొంగు పుల్లయ్య, మంచికంటి సుబ్బరంగయ్య, పెద్ది సుబ్బారాయుడు సభ్యులు.

# ఆంధ్ర పశుసంవర్ధక సంఘం

బాపట్ల, సెప్టెంబరు 5: ఆంధ్ర రాష్ట్ర పశు సంవర్ధక సంఘ ద్వితీయ వార్షిక సమావేశం యీనెల 24 నుంచి 26 వరకు జరుగుతుంది. పశు ప్రదర్శన, కోళ్ల ప్రదర్శన కూడా జరుగుతాయి. ప్రదర్శన నిర్వాహక సంఘ ప్రథమ సమావేశం నిన్న శ్రీ టి. చక్రరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆవులు, గేదెలు పాలు యివ్వడంలోను, ఎద్దులు బరువు లాగడంలోను, పాలేరు వెరపాలన, సింధీజాతి పశువులనుకూడా ప్రదర్శనలో వుంచాలని నిర్ణయించారు. ప్రదర్శనకు రూ 5 వేలు కావలసివుంటుందని అంచనా వేశారు. విరాళాలు సేకరించాలని నిశ్చయించారు.

# న్యాయస్థానాల ఉద్యోగుల బదిలీలు

గుంటూరు, సెప్టెంబరు 6: హైకోర్టువారు ఈ క్రింది ఉత్తరువులు చేశారు: (1) సెప్టెంబరు 1 వ తేదీనుంచి కడపలో సబ్ డివిజనల్ మేజస్ట్రేటు కోర్టును ఎత్తివేసిన సందువల్ల అక్కడ జిల్లా మునసబు, సబ్ డివిజనల్ మేజస్ట్రేటుగా పనిచేసిన శ్రీ పి. వి. జగన్నాథరావును జిల్లామునసబుగా కావలికి బదిలీ చేశారు. కావలిలో జిల్లామునసబు శ్రీ ఎస్. జగన్నాథరావును సబ్‌జడ్జిగా వేశారు. సెప్టెంబరు 1 నుంచి అడిషనల్ జిల్లా మునసబు ఫస్టుక్లాసు మేజస్ట్రేటుఅయిన శ్రీ జె. వెంకటరమణయ్య కడపలో జిల్లా మునసబు ఫస్టుక్లాస మేజస్ట్రేటుగా పని చేస్తున్నారు. (2) సెప్టెంబరు 1 నుంచి శ్రీకాకుళంలో సబ్ డివిజనల్ మేజస్ట్రేటు కోర్టును ఎత్తివేసినందువల్ల సబ్ డివిజనల్ మేజస్ట్రేటుగా పనిచేసిన శ్రీ కే. కృష్ణమూర్తిని ఏలూరుకు అడిషనల్ జిల్లా మునసబుగా బదిలీ చేసినారు.

### సబ్ జడ్జీలు

(1) కాకినాడలో అడిషనల్ సబ్ జడ్జిగా వున్న శ్రీ వై. వెంకటేశ్వరరావును శ్రీ వేదాంతం సత్యనారాయణ స్థానే ప్రిన్సిపల్ సబ్‌జడ్జిగా బెజవాడకు బదిలీ చేశారు. (2) విజయవాడ ప్రిన్సిపల్ సబ్‌జడ్జి శ్రీ వేదాంతం సత్యనారాయణను సబ్‌జడ్జిగా చిత్తూరుకు శ్రీ ఏ. డి. వి. రెడ్డి స్థానంలో బదిలీచేశారు. (3) చిత్తూరు సబ్ జడ్జి శ్రీ ఏ. డి. వి. రెడ్డిని శ్రీ బి. భాస్కరరాజుస్థానే సబ్‌జడ్జిగా నెల్లూరుకుబదిలీ చేశారు. (4) నెల్లూరు సబ్‌జడ్జి శ్రీ బి. భాస్కరరాజును అడిషనల్ సబ్‌జడ్జిగా విజయవాడకు బదిలీచేసి, శ్రీ ఎం. సత్యనారాయణ స్థానంలో వేశారు. (5) విజయవాడ అడిషినల్ సబ్‌జడ్జి శ్రీఎం. సత్యనారాయణను శ్రీకాకుళం సబ్ జడ్జిగా బదిలీచేసి, శ్రీ సి. జగన్నాథాచార్యులు స్థానంలో వేశారు. (6) శ్రీకాకుళం సబ్‌జడ్జి శ్రీ సి. జగన్నాథాచార్యులును నర్సాపురం సబ్‌జడ్జిగా శ్రీ వై. సూర్యనారాయణస్థానే వేసి, శ్రీ వై. సూర్యనారాయణను శ్రీకాకుళం జిల్లా మేజస్ట్రేటు (జుడీషియల్)గా నియమించారు.

కావలి జిల్లామునసబు శ్రీ ఎక్. జగదీశ్వరంపును సబ్ జడ్జిగా శ్రీ ఎం. రామమూర్తిస్థానే కావలిలోనే నియమించారు. వీరు జిల్లా మునసబు బాధ్యతలను వెంటనే కోర్టు హెడ్‌గుమాస్తాకు అప్పగించి వెంటనే సబ్‌జడ్జి పదవిని స్వీకరిస్తారు. శ్రీ యం. రామమూర్తి (సబ్‌జడ్జి, కావలి)ని, శ్రీ కే. సుబ్రహ్మణ్యాచారి స్థానే రాజమండ్రి సబ్‌జడ్జిగా నియమించారు. శ్రీ సుబ్రహ్మణ్యాచారిని కడపజిల్లా మేజస్ట్రేటు (జుడీషియల్)గా బదిలీచేశారు.

### బెజవాడ రైలుస్టేషనులో తపాలా సౌకర్యాలు

బెజవాడ, సెప్టెంబరు 6: విజయవాడ రైల్వేస్టేషనులోని (ఆర్. ఎం. ఎస్.) తపాలా పెట్టెలో ఉత్తరాలు వేసే విషయంలో వున్న నిబంధనలు ఇప్పుడు సడలించారు. సాయంత్రం 7 గం. తర్వాత వేసిన ఉత్తరానికి నాలుగణా 'లేటు ఫీజు' చెల్లించాలన్న నిబంధనను ఇప్పుడు రద్దుచేశారు. ఇకనుంచి ఆయా ఉత్తరాలు ఏ రైలైనా వేసేలను బట్టి (రైలు వచ్చేవేళకు సామాన్యంగా గంటలోపు) ఈ 'లేటు ఫీజు' ను అంటించవలసి వుంటుంది.

# ఆదర్శ గ్రామంగా జగ్గంపేట మార్పు

కాకినాడ, సెప్టెం 6: జగ్గంపేట గ్రామాన్ని ఆదర్శంగా రూపొందించాలని జిల్లా అధికారులు, ఆగ్రామ ప్రముఖులు జరిపిన సంయుక్త సమావేశంలో నిర్ణయించారు. డి. గోపాలరావు అధ్యక్షత వహించారు. గ్రామంలో మంచినీటి కుళాయిలు ఏర్పాటుచేయాలని, వ్యవసాయ సహకార సంఘాలభివృద్ధి చేయాలని పశుసంపద పెంపొందించాలని తీర్మానించారు. చేనేత సహకార సంఘం నెలకొల్పాలని కూడా నిర్ణయించారు. ఉన్నతపాఠశాలభవనానికి రు. 20 వేలు ప్రభుత్వం మంజూరు చేసివున్నది. ఒక పశు వైద్యశాలను ఇటీవల జిల్లాకలెక్టరు ప్రారంభంచేశారు.

కండేపల్లిలో పశువులకు ప్రథమ చికిత్సాకేంద్రం తెరిచారు. దీనికి శ్రీ పసుమర్తి సత్యనారాయణ విరాళమిచ్చారు.

# ఒంగోలు ఖైదీ ఆత్మహత్యా ప్రయత్నం

ఒంగోలు, సెప్టెంబరు 5: ఒక ఖూనీ కేసులో ముద్దాయిగా సెషన్సుకోర్టు విచారణకు పంపబడిన దమ్ము చంద్రయ్య అనే అతడు సబ్‌జైలులో కంఠం కోసుకొని ఆత్మహత్య చేసికోవడానికి ప్రయత్నించాడు. కాని, పోలీసులు వెంటనే అతనిని ఆస్పత్రికి చేర్చడంవల్ల ప్రబికాడు.

ఈ సంఘటన మొన్న 3 వ తేదీనాడు జరిగింది. కత్తికోత పడిన అతని కంఠభాగం ఇంకా నెత్తురు చిమ్ముతూనేవుంది.

ఇతను, ఇతని సోదరుడు గూడా ఒక ఖూనీకేసులో ముద్దాయీలని, సెషన్సులో తనకు శిక్ష తప్పదేమోననే భయంలో ఇతను ఇట్లా చేసెనని పోలీసులు చెబుతున్నారు.

స్టేషనరీ సబ్ మేజస్ట్రేటు ఖయిదీదగ్గరనుంచి మరణవాఙ్మూలం తీసుకున్నారు. (స్వ. వి.)

# ఆంధ్ర జాతీయ కార్మిక సంఘం

రాజమండ్రి, సెప్టెంబరు 6: అఖిల భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఆంధ్ర శాఖ వార్షిక సమావేశం అక్టోబరు 9 నాడు విజయవాడలో జరుగుతుంది. కేంద్ర కార్మిక మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ సభను ప్రారంభిస్తారు.

# శ్రీకాకుళంజిల్లా హరిజన సేవాసంఘం

శ్రీకాకుళం, సెప్టెంబరు 5: జిల్లాలో అస్పృశ్యతా నివారణ ప్రచారకులను మరో ఇద్దరిని నియమించాలని జిల్లా హరిజన సేవాసంఘం నిర్ణయించింది. కృష్ణాపురంలో హరిజన ప్రార్థనమందిరం నిర్మించాలని రాష్ట్రసంఘానికి సిఫార్సు చేశారు. జిల్లాలో హరిజనసేవా కార్యక్రమం చురుకుగా జరగడానికి అన్ని తాలూకాలనుంచి 18 మందిని నియమించుకున్నారు. సమావేశానికి శ్రీ కిల్లి అప్పలనాయుడు అధ్యక్షత వహించారు.

# విజయవాడ

విజయవాడ కన్నడ సేవాసంఘ ద్వితీయ వార్షికోత్సవం సందర్భంలో ఈనెల 4 వ తేది రాత్రి మైసూరు ఆస్థాన విద్వాన్ శ్రీ స్వరమూర్తి వీణాగానంచేశారు. శ్రీ చదలవాడ సుబ్బయ్య ఫిడేలు, శ్రీ కోలంక వెంకటరాజు మృదంగముతో వాద్యసహకారం చేశారు. అనంతరం డాక్టరు పి. వి. ఆచార్ గారు రచించిన "రావు సాహెబ్" అను నాటిక ప్రదర్శించారు.

# కవుతరం

దామోదరయ్యగారి మరణమునకు శ్రీ కానూరి దామోదరయ్య బోర్డు హైస్కూలు ఉపాధ్యాయులు, విద్యార్థులు సంతాపము తెల్పుతూ తీర్మానం చేశారు. ప్రధానోపాధ్యాయులగు శ్రీ కానూరి వేణుగోపాలరావు పాఠశాలకు చేసిన సేవలు ప్రకటించుచు, వారి దాతృత్వమును, సుగుణములను ప్రశంసించారు. తదితర ఉపాధ్యాయులు, విద్యార్థి సంఘాధ్యక్షుడు మాట్లాడారు. ఉపాధ్యాయులు విద్యార్థులు విరాళాలు సేకరించి దామోదరయ్యగారి తైలవర్ణ చిత్రాన్ని పాఠశాలలో పెట్టటానికి నిశ్చయించారు.

# మాచర్ల

ప్రభాకర క్రియేషన్స్ క్లబ్ వార్షిక సంఘానికి శ్రీ ఎ. జంబులింగం ప్రారంభం జరిపారు. శ్రీయుతులు సి. సత్యనారాయణ, యం. యస్. ప్రగడ ప్రసంగించారు. శ్రీ ఆర్. వీరాస్వామి వందన సమర్పణచేశారు.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ నవమి 1955 - సం॥ సెప్టెంబరు 10 శనివారం శ॥ నవమి 22-21 మృగ 13-20 వర్జ్యం 31-15 ల 22-45 ఘ.

ఖ॥ దశమి సెప్టెంబరు 11 ఆదివారం ఆ॥ దశమి 20-15 ఆర్ద్ర 11-59 వర్జ్యం 23-19 ల 24-50 ఘ.

ఆంధ్రపత్రిక

శ్రీ మన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ నవమి శనివారం

## ఉపముఖ్యమంత్రి అభిప్రాయాలు

రాజధాని మార్పుకు ఆందోళన చేయడం మానివేసి, విశాలాంధ్రకోరకు ఆందోళన చేయాలని ఆంధ్రరాష్ట్ర ఉపముఖ్యమంత్రి విజయవాడలో హితవు చెప్పారు. కర్నూలు వెళ్ళి అక్కడ ...

... త్నింపగలరనే సమగ్రాంధ్ర రాష్ట్రాన్ని మనస్ఫూర్తిగా వాంఛించినవారందరూ భయపడినారు. వారి భయానికి, అనుమానాలకు ఆధారం లేకపోలేదని శ్రీ సంజీవరెడ్డిగారు విజయవాడలోను, కర్నూలులోను చేసిన ప్రకటనలు ఋజువు చేసినవి. వాదబలం లేనప్పుడు, జరిగిన నిర్ణయం సమర్థించ సాధ్యం గానిదని తెలిసినప్పుడు, ఆదుర్బల వాదానికి, అనుచిత నిర్ణయానికి బద్ధులైనవారు, నిర్ణయం మారిపోతుందేమోనని అనుమానంకలవరపడుతూ వుండడం సహజమే.

అయితే శ్రీ సంజీవరెడ్డిగారు తాము విజయవాడ రాజధాని కావడానికి విముఖులం కామని, జరిగిన నిర్ణయాన్ని మార్చడానికి మాత్రమే విముఖులమని ఇస్తూ డంటున్నారు. తాత్కాలిక రాజధానిగా మాత్రమే కర్నూలు వుంటుందని చెప్పిన వారు కూడా వీరే. రాష్ట్ర రాజధాని విశాఖపట్నంలో ఏర్పడాలన్న శ్రీ రొక్కం లక్ష్మీనరసింహం దొరగారి తీర్మానాన్ని బలపర్చినవారు కూడా శ్రీ సంజీవరెడ్డిగారే. క్రిందటి అసెంబ్లీ ఈ తీర్మానాన్ని ఆమోదించిందనీ, ఆ తీర్మానాన్ని, ...

## పౌరసత్వం బిల్లు సమిష్టి పరిశీలన

### రాజ్యసభ సమ్మతి

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 8: పార్లమెంటు సమిష్టి పరిశీలనసంఘానికి పౌరసత్వంబిల్లును నివేదించాలన్న ప్రతిపాదనకు నేడు రాజ్యసభ అంగీకరించింది. దీనిని లోక్‌సభ ఇంతకుముందే అంగీకరించింది.

చర్చకు దేశీయాంగమంత్రి శ్రీ పంత్ జవాబిస్తూ కామన్వెల్తు సభ్యత్వాన్ని సమర్థించారు. ఈ ఏర్పాటువల్ల దక్షిణాఫ్రికావాళ్లకు భారత పౌరసత్వం లభించే ప్రమాదంలేదని ఆయన హామీ ఇచ్చారు.

"ఏ కామన్వెల్తు దేశమయినా తనవారలకు భారతపౌరసత్వం కావాలంటే, తన పౌరసత్వ చట్టాలను ముందుగా భారతప్రభుత్వ గెజెట్‌లో ప్రకటించాలి. ఇట్లా తన పౌరసత్వ చట్టాలను ప్రకటించవలసిందని భారత ప్రభుత్వాన్ని కోరేపాటి ధైర్యం దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి ఉన్నదని అనుకోను. ఒకవేళ అట్లా కోరినా, భారతప్రభుత్వం దానిని పూర్తిగా నిరాకరిస్తుంది." అని శ్రీ పంత్ వివరించారు.

కామన్వెల్తు సభ్యత్వమన్నది ఎన్నో దేశాలు కలిసి వ్యవహరించాలన్న ఆశయానికి చిహ్నమని శ్రీ పంత్ అన్నారు. దేశీయాంగ ఉపమంత్రి శ్రీ దాతార్ చర్చలో జోక్యం కలిగించుకుని మాట్లాడు ...

## కంపెనీల చట్టం ప్రభుత్వ సంస్థలకు గూడా వర్తించాలి

### లోక్‌సభలో సూచన:

## విదేశీ కంపెనీలకు అంతర్జాతీయ మర్యాదలు వర్తిస్తవని మంత్రి వివరణ

న్యూఢిల్లీ, సెప్టెం 8: లోక్‌సభలో కంపెనీలచట్టంపై చర్చ ఇవ్వాళ చివరి దశకు చేరింది. చట్టంలోని చివరి నిబంధనలు ప్రభుత్వాధీనకంపెనీలకు సంబంధించిన వగుటచే సభ్యుల విమర్శలు కంపెనీల మీదనుంచి ప్రభుత్వాధీన కంపెనీలమీదికి మళ్లాయి. ముఖ్యంగా వ్యాపారస్థుల ప్రతినిధులు కంపెనీలకు ఒకరకం నిబంధనలు, ప్రభుత్వ కంపెనీలకు ఒకరకం నిబంధనలు ఉండరాదన్నారు. చట్టంలోని ఏ నిబంధనఅయినా సరే ప్రభుత్వ కంపెనీలకు వర్తించకుండా మినహాయించే అధికారం ప్రభుత్వానికి ఉంచరాదన్నారు.

ఇవ్వాళ ముందు 565 నుంచి 609 వరకూగల నిబంధనలపై చర్చ జరిగింది. ...

ప్రభుత్వాలుగానీ లేక ప్రభుత్వ సంస్థలుగానీ చెల్లించివుంటే అట్టి కంపెనీలన్నీ ప్రభుత్వ కంపెనీలుగా గణించబడేటట్లు నిర్వచనాన్ని సవరించాలన్నారు. పండిత్ ఠాకూర్దాస్ భార్గవ ప్రభుత్వం ప్రభుత్వ కంపెనీలకు తాఖీదులు పంపే ముందు సలహాసంఘసలహాపొందాలన్నారు. శ్రీ బి. పి. ఝున్‌ఝున్‌వాలా ప్రభుత్వ కంపెనీల సందర్భంలో చట్టాన్ని మార్చేటట్టి తాఖీదును ముందు సలహాసంఘానికి చూపి, తర్వాత పార్లమెంటు ముందు పెట్టాలన్నారు. శ్రీ తులసీదాస్ కిలాచంద్ నూటికి ఏభైవంతుల వాటాలు ప్రభుత్వానికి సంబంధించినప్పుడే అవి ప్రభుత్వ కంపెనీలుగా గణించాలన్నారు. ...

## చిత్తరంజన్‌లో సాలుకు 300 ఇంజన్ల ఉత్పత్తి

## గోవా విమోచనకు ప్రభుత్వచర్యలుచాలవు

(1 వ పేజీ తరువాయి)

## గోవారేడియో ప్రచారం

## అమెరికా వైఖరికి లిస్బన్ నిర్వచనం

## సింహళంలో పోర్చుగీస్ ప్రతినిధి

## పోర్చుగీసులచే మరొక హత్య

## మద్రాసు ఆర్థికమంత్రి ఆశాభావం

(1 వ పేజీ తరువాయి)

సుఖంగాచదువుపూర్తిచేసుకోవచ్చునని హామీ ఇవ్వడమే నా రాకకు ప్రధాన కారణం. ఎవరో తమను ఇబ్బంది పెడతారని తమిళ విద్యార్థులు కలతచెందడం వారి భ్రమ మాత్రమే. మన రాజ్యాంగం ప్రకారం ప్రతి రాష్ట్రంలోనూ వెనుకపడిన తరగతులకూ, అల్పసంఖ్యాకులకూ తగినంత రక్షణ ఉన్నది. ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారి నాయకత్వాన శైశవదశలో ఉన్న ఆంధ్రరాష్ట్రం సక్రమంగా అభివృద్ధి చెందగలదని ఆశిస్తున్నాను."

## ప్రభుత్వస్థితి స్థానిక సంస్థల లాగే ఉంది

ఆ తర్వాత ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి మాట్లాడుతూ ఇట్లా అన్నారు: "మీరు సహకరించితే క్రమంగా మీ కోరికలు నెరవేరగలవు. పురపాలక సంఘాల ఆర్థిక స్థితిగతులకంటే, కేంద్ర ...

సుబ్రహ్మణ్యంగారికి పురపాలకసంఘం అధ్యక్షుడు సమర్పించారు. అందులో ఇట్లా ఉన్నది: "మద్రాసు రాష్ట్రంలోని చెంగల్పట్టు, సేలం, ఉత్తర ఆర్కాటు మొదలైన జిల్లాలలోని తెలుగువారి భాషా సంస్కృతుల అభ్యున్నతికి దోహదం చెయ్యగలరని ఆశిస్తున్నాం. ఆంధ్ర-తమిళ సరిహద్దుల సమస్యలు సంతృప్తికరంగా ప్రశాంతంగా పరిష్కారం కాగలవని అభిలషిస్తున్నాం." ఆర్. హనుమంతరావుగారి వందనలతో సభ ముగిసింది.

## కళాశాలల సందర్శనం

శ్రీ గోపాలరెడ్డి, శ్రీ సి. సుబ్రహ్మణ్యం యివాళ, ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల సందర్శించారు. గోపాలరెడ్డిగారు విద్యార్థుల సమావేశంలో ప్రసంగిస్తూ త్వరలోనే, యీ కళాశాల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయబడుతుందని అప్పుడు యీ కళాశాల ప్రాముఖ్యం యింకా ఎక్కువవుతుందని చెప్పారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయం ప్రస్తావిస్తూ, విద్యావంతులై నిరుద్యోగులుగా ఉన్న వేలాది యువకు ...

## క్రమశిక్షణ అవసరం

## రాజకీయ పక్షాలతో సంప్రతించాలి

## మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రుల అవసరాలు

## సమయోచితంగాలేదని శ్రీ విశ్వనాథం విమర్శ

## శ్రీ ఢేబర్ ప్రకటన

(1 వ పేజీ తరువాయి)

## సహాయ కారిగాని సత్యాగ్రహం

## చెవిటివారికి విద్యాబోధన

## స్వాతంత్ర్యానికి సమాధి

## లండన్ పై సైప్రస్ నాయకుని బొబ్బలు

సైగమతం (సైప్రస్), సెప్టెం 8: సైప్రస్‌కు స్వయం నిర్ణయాధికారం లభించేదాకా పోరాటం సాగుతూనే వుంటుందని ఎనోసిస్ ఉద్యమనాయకుడు ఆర్చిబిషప్ మకరోయిస్ నేడు స్పష్టంగా ప్రకటించారు. ఈ పోరాటాన్ని జైళ్లుగాని, ఉరితీతలుగాని, ప్రవాసాలుగాని ఆపలేవని కూడా ఆయన అన్నారు.

బ్రిటిష్ ప్రభుత్వంచేసే రాజకీయ సంస్కరణలపై మాట్లాడుతూ, సైప్రస్‌కు ఆ సంస్కరణలు ఎటువంటివైనా సరే, వాటిని ఎన్నడూ ఆమోదించరని, లండన్ సమాలోచనలకు టర్కీని ఆహ్వానించడమే తప్పు అని ఆయన విమర్శించారు. ...

## లావోస్‌లో యుద్ధ విరమణ

### పర్యవేక్షకుల నివేదిక

## దౌర్జన్యవాదులకు మలయా క్షమాభిక్ష

## శ్రీ త్యాగియారు పర్యటన

## సహాయకారి

## ఇండోనేషియాలో ఎన్నికలు

## ఆయుధ విసర్జన చర్చలు

# ఛిన్నాభిన్నం కాకపోవడమే సమితి సాధించిన విశేషం

## ప్రపంచం భారత విదేశాంగ నీతిని అర్థం చేసుకోగలుగుతున్నదని శ్రీ మీనన్ నమ్మిక

బొంబాయి, సెప్టెంబరు 8: ఐక్యరాజ్య సమితి ఛిన్నాభిన్నం కాకుండా నిలిచి ఉండటమే ఆ సంస్థ సాధించిన గొప్ప విశేషమని శ్రీ వి. కె. కృష్ణమీనన్ అన్నారు.

ఇదివరకు నానారాజ్యసమితి పదేండ్లపాటు సరిగ్గా పనిచేసి, తర్వాత నశించిందనీ, ఇప్పుడు ఈ సమితి విషయంలో అందుకు వ్యతిరేకంగా జరుగుతున్నట్లు కనపడుతున్నదనీ, అది సభ సూచన అనీ శ్రీ మీనన్ అన్నారు.

ప్రపంచ రాజ్యసమితి ఈ రెండు పదేండ్లు దాటింది. చాలా కల్లోల జీవితం గడిపింది. దాని అధ్వర్యాన ఇంతవరకూ ఆట్టే సమస్యలు పరిష్కారం కాలేదు. వివాదాలు సమసిపోలేదు. వివిధ దేశాలు సామరస్యంతో వ్యవహరించే కేంద్రంగా అది లేదు. అయినా సమితి ఉనికికి భంగం కలగలేదు. పైగా ఇంతవరకూ ఉంటూ వచ్చిన పరిస్థితి పోయి వివిధ దేశాల మధ్య సత్సంబంధాల పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ మార్పు రావటంలో మన దేశం ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ సారథ్యాన చేసిన కృషి అనల్పమైనది. నిరుడు ఇండోచైనా యుద్ధ విరమణతో పాలిశెంట్ల కాలంలో మొట్టమొదటిసారి ప్రపంచంలో ఎక్కడా యుద్ధం అనేది లేకుండాపోయింది. అయుధ విరమణను సాధించటంలో కూడా భారతదేశం వహించిన పాత్ర విఖ్యాతిమైనది. ఇప్పుడు సర్వసాధారణంగా ప్రపంచం అంతా కూడా భారత విదేశాంగ నీతినీ, భారతదేశ ఉద్దేశాలనూ బాగా అర్థం చేసుకొన్నది. మన శాంతి కోరిక, అంతర్జాతీయ సామరస్యవాంఛా సుప్రసిద్ధమై, ప్రపంచంలో శాంతికి ఒక విధమైన వాతావరణం కలిగించాయి.

భారతదేశ విధానానికి మూలం జాతిపిత చూపిన ఆదర్శమే. ఆ మహాత్ముని సిద్ధాంతాన్ని పూహించి, ఆచరణలో పెట్టిన తొలి పురుషుడు ఆయనే. ఈనాడు మనదేశానికి అనర్ఘస్థానం లభించిందంటే అందుకు కారణం ఈనాటి మన ఎవరి తెలివితేటల వల్లనో కాదు. ఇది గాంధీదేశం కావటము, శాంతిని కోరేదేశం కావటమే. అని శ్రీ మీనన్ అన్నారు.

### ఢిల్లీకి ఈజిప్టు ఉపప్రధాని రాక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: ఈజిప్టు ఉపప్రధాని వింగ్ కమాండర్ జమాల్ సలీమ్ ఈ రాత్రి ఇక్కడికి వచ్చారు. వీరు కొన్నిరోజులు ఇక్కడ వుంటారు.

ఈయన ప్రతింవారం కలకత్తా వచ్చి, ఆ చుట్టుపట్ల జరుగుతున్న అభివృద్ధి నిర్మాణాలను వీక్షించారు. భాక్రానంగల్ నిర్మాణంకూడా చూసి వచ్చేవారం బొంబాయి వెడతారని తెలిసింది.

జమాల్ సలీమ్‌కు న్యూఢిల్లీ రైల్వే స్టేషన్లో విదేశాంగ వ్యవహారాల సహాయ మంత్రి డాక్టర్ సయ్యద్ మహమ్మద్ ఉపమంత్రి అనిల్ కుమార్ చాందా ప్రభృతులు స్వాగతమిచ్చారు.

### ప్రధానితో కలయిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: ఈజిప్ట్ ఉపప్రధాని ఇవ్వాళ ప్రొద్దున ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూను కలుసుకొన్నారు.

విదేశాంగ వ్యవహారాల సహాయ మంత్రి డాక్టర్ సయ్యద్ మహమ్మద్‌ను కూడా చూసి మాట్లాడారు. లోక్ సభ సభాపతినికూడా కలుసుకొని, తర్వాత పార్లమెంటు ఉభయసభలకూ వెళ్లి చూశారు.

# గోటేరు పంచాయతీ రద్దు

## బాధ్యత స్వీకరించే సభ్యుడే లేడు!

కర్నూలు, సెప్టెంబరు 9: ఆలూరు తాలూకా గోటేరు పంచాయతీబోర్డును యీరోజునుంచీ ఒక సంవత్సరంపాటు రద్దుచేశారు. 1956 సెప్టెంబరు 9 వ తేదీన పునర్నిర్మించబడుతుంది.

పంచాయతీబోర్డు విధులను సక్రమంగా నిర్వర్తించక, చట్టాన్ని ఉల్లంఘించినందుకు రద్దుచేయడమైంది. బోర్డు అధ్యక్షుడు రాజీనామా యివ్వగా పంచాయతీబోర్డు రాజీనామాను ఆమోదించింది. అయితే, ఉపాధ్యక్షుడు అధ్యక్షపదవి తీసుకొనడానికి నిరాకరించారు. అంతేగాక, మిగతా 8 గురు సభ్యులలోగూడా ఎవరూ తాత్కాలికంగా ఆ బాధ్యతలు స్వీకరించడానికి ఒప్పుకోక రాజీనామా యిచ్చారు కనుక బోర్డు పరిపాలన విషయం సభ్యులలో ఎవరికీ పట్టలేదుగనుక, స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరు రద్దుచేశారు.

### చుండ్రిగర్‌కు పాక్ పరిషత్తు సభ్యత్వం

కరాచీ, సెప్టెంబరు 8: పాకిస్తాన్ న్యాయశాఖా మంత్రి ఐ. ఐ. చుండ్రిగర్ నరాజ్యాంగపరిషత్తుఅభ్యర్థిగా నియమించడానికి ముస్లింలీగ్ పార్లమెంటరీ బోర్డు అంగీకరించింది. తాత్కాలిక గవర్నర్ జనరల్ ఇస్కందర్ మీర్జా రాజీనామా పెట్టినందువల్ల పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్తులో ఈఖాళీ ఏర్పడింది.

### తూర్పుపాకిస్తాన్‌లో వరదల నివారణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: తూర్పు పాకిస్థాన్‌లో వరదల నివారణ చర్యలపై ప్రారంభచర్చలు జరపడానికి భారత ప్రభుత్వం కరాచీకి ఒకరాయబార వర్గాన్ని పంపిస్తున్నారు. కేంద్ర జల విద్యుచ్ఛక్తి సంఘాధ్యక్షులు కన్వర్ సేన్ ఈ రాయబారవర్గానికి నాయకులు. రాయబారవర్గంలో ఎ. ఆర్. ఖన్నా, డాక్టరు కె. ఎల్. రావు, హెచ్. సి. కొర్లాగారలు సభ్యులు.

### మొక్కలకు చీడ పట్టకుండా కృషి

హైదరాబాదు, సెప్టెంబరు 7: మొక్కలకు పట్టే చీడ పురుగులు మొదలైన వాటిని నిర్మూలించే కేంద్ర మొకటి హైదరాబాదులో నెలకొల్పడానికి భారత ప్రభుత్వం అంగీకరించారని ఈ వేళ ఇక్కడ అధికారరీత్యా తెలిసింది.

అవసర పరిస్థితిలో ప్రభుత్వానికి సప్లయిచేసే నిమిత్తం ఈ కేంద్రంలో క్రిమి సంహారక ఔషధాలను కూడా సేకరించి నిలవచేస్తారు.

### ఎస్టేట్ల రద్దు విచారణ సంఘం

విజయనగరం, సెప్టెంబరు 9: ఎస్టేట్ల రద్దు విచారణ సంఘం అక్టోబరులో ఈ దిగువ కార్యక్రమం ప్రకారం విచారణ జరుపుతుంది: అక్టోబరు 1 నుండి 4, 17, 27, 28, 31 విజయనగరం. 6, 7, 19 నుండి 21 వరకు శ్రీకాకుళం, 11 నుండి 13 వరకూ కాకినాడ.

### మద్రాసు విశ్వవిద్యాలయం ఎం. ఎల్. ఫలితాలు

మదరాసు, సెప్టెంబర్ 8: మదరాసు విశ్వవిద్యాలయం ఎం. ఎల్. పరీక్షా ఫలితాలు శనివారం 10 తే సాయంత్రం దిన పత్రికలలోను మధ్యాహ్నం 2 గం విశ్వవిద్యాలయ భవనంలోను ప్రకటిస్తారు.

# ఆలూరు వరద బాధితులు

## ప్రభుత్వ సహాయం

కర్నూలు, సెప్టెంబరు 9: ఇటీవల కలిగిన విపరీత వర్షాలవల్ల, వరదలవల్ల బాధలుపడుతున్న ఆలూరు తాలూకా ప్రజలకు ఆంధ్ర ప్రభుత్వం ఇంతకు పూర్వం మంజూరుచేసిన మొత్తంగాక అదనంగా ఈ క్రింది మొత్తాలు మంజూరు చేశారు.

వరద బాధితులకు వ్యవసాయదారుల కిచ్చే ఋణాల రూపంలో రూ. 20 వేలు. ఈ మొత్తంలో ఒకొక్క కుటుంబానికి వెయ్యి రూపాయలవరకు ఋణ సహాయం చెయ్యవచ్చును. గృహాల పునర్నిర్మాణానికి మొత్తాలు వినియోగించుకోవచ్చును.

### హాలహర్వి, కురువిళ్లి

హాలహర్వి, కురువిళ్లి గ్రామాలలో బాధితులకు ప్రత్యేకంగా 5 వేల రూపాయలు మంజూరు చేశారు. హాలహర్వి గ్రామంలో వరదలో మునిగిపోయిన బేడా వీరప్ప కుటుంబానికి ప్రత్యేకంగా 50 రూపాయల అదనపు సహాయం ఏర్పాటుచేశారు.

# అణుశక్తి ఉత్పత్తి యంత్రం

## భారతదేశాని కివ్వ కెనడా సంసిద్ధత

ఒట్టావా, సెప్టెంబరు 8: భారతదేశానికి ఒక ప్రయోగాత్మక అణుశక్తి ఉత్పత్తి యంత్రాన్ని ఇవ్వటానికి తాము సంసిద్ధత తెలిపినట్లు కెనడా వ్యాపారశాఖ మంత్రి ఈ రాత్రి వెల్లడించారు. ఇది 1947 నుంచీ కెనడాలో పనిచేస్తున్న యంత్రంవంటిదేననీ, దీనిని కొలంబో పథకం క్రింద ఇస్తారనీ ఆయన తెలిపారు. ఇందుకు యింకా భారతదేశం అంగీకారం రాలేదట.

### భారత రష్యాల విమాన రవాణా

బొంబాయి, సెప్టెంబరు 8: రష్యా, భారత దేశాలమధ్య విమాన ప్రయాణాలు వ్యాపారాలకు సంబంధించిన ఏర్పాట్లకోసం సంప్రదింపులు జరపడానికి 'ఎర్ ఇండియా ఇంటర్నేషనల్' తరఫున ఒక ప్రతినిధి వర్గం మాస్కోకు పోతున్నది. ఇందులో శ్రీ జె. ఆర్. డి. టాటా?, శ్రీ జె. సి. మలానీ సభ్యులు. సెప్టెంబరు 14 నాటికి వీరు మాస్కోలో వుంటారు.

ఈ సమాలోచనలు జయప్రదంగా సాగితే వీరు ఒప్పందాన్ని వ్రాసుకు వస్తారు.

### ధోల్‌పూర్ వారసత్వం సమస్య

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: కోటా మహారాజా రాజీనామా చేసినందువల్ల ధోల్‌పూర్ సంస్థానం వారసత్వ సంఘంలో ఆయనస్థానే దుంగాల్‌పూర్ మహారాజాను సభ్యుడుగా నియమించారు. ఇంతవరకు అనేక కారణాలవల్ల ఈ సంఘం పని ప్రారంభించలేక పోయింది. ఇప్పుడు ఈయనను నియమించడంవల్ల ఈ ధోల్‌పూర్ వారసత్వం వ్యవహారం తేలిపోతుందని అంతా భావిస్తున్నారు.

### పాకిస్థాన్‌లో పరిశ్రమల బ్యాంకు

కరాచీ, సెప్టెంబరు 8: పరిశ్రమల అభివృద్ధికి విదేశీయుల పెట్టుబడి వినియోగించే లక్ష్యంతో పాకిస్థాన్‌లో పరిశ్రమల బ్యాంకు ఏర్పాటుచేసే విషయం పాకిస్థాన్ ప్రభుత్వ పరిశీలనలో ఉన్నదని పాకిస్థాన్ బ్యాంకు గవర్నరు అబ్దుల్ కాదిర్ తెలియజేశారు. ఈవిషయం పరిశీలించడానికి ప్రపంచబ్యాంకు అధికారులు త్వరలో నే కరాచీకి వస్తారు.

# ఏటేటా లక్షటన్నుల ఆహారం నష్టం

## కొల్లేరులోకి పోయేవాగులు: ప్రతి ఏడూ పథకరచన

విజయవాడ, సెప్టెంబరు 8: బుడమేరుకు ఆనకట్ట నిర్మించి, విజయవాడ తాలూకా ఇబ్రహీం పటణం, మూలపాడు గ్రామాల మీదుగా ఒక కాలవ త్రవ్వించి బుడమేరు నీళ్ళను కృష్ణలోకి మళ్లించే కవులూరు డైవర్షన్ పథకాన్ని వెంటనే అమలు జరిపించవలసిందిగా కోరుతూ కృష్ణాజిల్లా నందివాడలోని బుడమేటి రైతుకాంగ్రెసు ప్రతినిధులు ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారికి నిన్న ఒక విజ్ఞప్తి సమర్పించారు.

జిల్లా రైతుకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ పాములెడ్డి వెంకటసుబ్బారెడ్డి, బుడమేటి రైతుకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ చేరుకూరు వీరయ్య, శ్రీయుతులు మరిరెడ్డి పకీరు రామదాసురెడ్డి, ఆదృష్ట మిలి పుండరీకాక్షుడు యార్లగడ్డ రామారావు, ఒత్తూ రామకృష్ణయ్యగారలు ఈ రాయబారంలో ఉన్నారు.

విజ్ఞప్తిలో ఇటా ఉన్నది. "బుడమేరు హైదరాబాదు రాష్ట్రంలో పుట్టి కృష్ణాజిల్లాలోని తిరువూరు, విజయవాడ గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాలలోనూ, పశ్చిమగోదావరి జిల్లా భీమవరం, ఏలూరు తాలూకాలలోనూ ప్రవహిస్తున్నది. ఉప్పుటేరులో కలిసి సముద్రంలోకి ప్రవహిస్తున్నది. బుడమేరు వరదలవల్ల పైన వివరించిన తాలూకాలకు చాలాకాలంగా విపరీతమైన నష్టం సంభవిస్తున్నది. గండివాగు, పులివాగు, వన్నేరు, పత్తికొండ, టిల్లికోడుల వంటి చాలావాగులు బుడమేరులో కలుస్తున్నవి. ఈ వరదవల్ల ఏటేటా దాదాపు లక్షటన్నుల ఆహార ధాన్యాలూ, సుమారు 30 వేల పశువులకు సరిపోయే గ్రాసమూ నష్టమవుతున్నవి. రైతులకు శిస్తు మినహాయింపు మంజూరు చేయవలసి వస్తున్నందున ప్రభుత్వమూ, ధాన్యమంతా వరదపాలు కావడంవల్ల రైతులూ కూడా నష్టపోవలసి వస్తున్నది.

### 1837 నుంచి ఆందోళన

"ఈ వరద రాకుండా తగు ఏర్పాటు చేయించవలసిందిగా 1837 నుంచీ ఆందోళన జరుగుతున్నది. ప్రభుత్వం ఏవో కొన్ని పథకాలు తయారుచేసి బడ్జెట్‌లో కొంత డబ్బు కేటాయిస్తున్నప్పటికీ ఇంతవరకూ చెప్పుకోతగ్గ పనియేమీ జరగలేదు. ప్రభుత్వం తయారు చేయించిన ఈ క్రింది పథకాలను వెంటనే అమలు జరిపించమని అభ్యర్థించుచున్నాం.

"కవులూరు డైవర్షన్ పథకంవల్ల బుడమేరు నీళ్లల్లో చాలాభాగం కృష్ణలోకి వెళతవి కనుక ఆ పథకాన్ని వెంటనే అమలు జరిపించాలి. బుడమేరు ఒక పద్ధతిలో ప్రవహించదు. కట్టలంటూ లేవు. ఏలూరు కాలవనుంచి బుడమేరుకు కట్టలువేయించి, అవసరమైనచోట్ల అకాలవ లోతు పెంచి వెడల్పులను ఎక్కువచేయించి గట్లకు బలం కలిగించే పథకాలనూ, బుడమేరుకు రెండువైపులా వరదకు తట్టుకోగల గట్లను పోయించే పథకాన్నీ వెంటనే అమలు జరిపించడం అవసరం.

### మేటవేసింది

"బుడమేరు కొల్లేరులో కలిసే ప్రదేశం మేట వేసిపోవడంవల్ల నీళ్ళు బాగా ప్రవహించడంలేదు. అందువల్ల ఉప్పుటేరులోకి నీళ్ళు రావడానికి చాలాకాలం పడుతుంది. కనుక బుడమేరు-కొల్లేరునీళ్ళు సులభంగా ఉప్పుటేరులోకి ప్రవహించడానికి వీలుగా ఆ ప్రదేశమంతా లోతు ఎక్కువ చేయించి, ఒకకాలవ త్రవ్వించాలి."

"బుడమేరుకు గ్రాండ్ ట్రంక్ రోడ్ మీద కేసరిపల్లి వద్ద వున్న వంతెన, కంకిపాడు-కేసరిపల్లి రోడ్డుమీద ఉప్పుటేరువంతెన, తిరువూరు-బందరు రోడ్డు నందివాడసత్రం—పుట్టగుంటల మధ్య వంతెనలకూ వెంటనే మరమ్మతు చేయించాలి."

"కొల్లేరు, బుడమేరుల నీళ్ళు ఇంకా ఎక్కువగా సముద్రంలోకి పోవడానికి వీలుగా ఉప్పుటేరు లోతు వెడల్పులను ఎక్కువ చేయించే పథకాలను కూడా బుడమేరు పథకాలతోపాటు అమలు జరిపించాలి."

### 'ఆయిల్ టెక్నాలజీ' సంస్థ

## 'త్వరలో కేంద్ర పరమవుతుంది'

అనంతపురం, సెప్టెంబరు 9: ఇక్కడి ఆయిల్ టెక్నాలజికల్ సంస్థను త్వరలోనే కేంద్ర ప్రభుత్వానికి అప్పజెప్పడం జరుగుతుందని, ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు నిన్న ఈసంస్థను సందర్శించిన సందర్భంలో సూచనగా తెలియజేశారు.

నూనె దినుసుల పరిశోధనకు సంబంధించిన అఖిలభారత సంస్థ అవ్వాల్సిన హోదాను పొందేటట్లు ఇది అభివృద్ధిచేయబడుతుంది.

# మొరాకోలో ఫ్రెంచి దుండగాలు

## పాత సుల్తాన్‌ను మళ్లీ ప్రతిష్ఠించే అవసరం

కైరో, సెప్టెంబరు 8: ఫ్రెంచి ప్రభుత్వం పదవీచ్యుతుని జేసిన సుల్తాను బిన్ యూసఫ్‌ను మెడగాస్కర్ నుంచి పారిస్‌కు తీసుకువచ్చి, అక్కడ ఆయనకు స్వాతంత్ర్యం యిచ్చి ఆయన అధ్వర్యం క్రింద రీజెన్సీ సంఘాన్ని ఏర్పాటుచేస్తే తాను దాన్ని ఆమోదిస్తానని మొరాకో ఇస్తిక్‌లాల్ నాయకుడు సి. అల్లాల్ ఫాసీ ప్రకటించారు. ఇది ఆయన పూర్వం అనుసరించిన వైఖరికి భిన్నంగా వుంది. రోంలో ఇస్తిక్‌లాల్ నాయకుల సమావేశం అనంతరం ఈమార్పు వచ్చింది.

మొరాకో పరిస్థితిపై అరబ్ దేశాలు తమ అభిప్రాయాలు ప్రకాశ్యంగా తెలియజేస్తున్నాయి. నేడు లిబియా ప్రధాన మంత్రి ముస్తాఫా బీన్ హాలీం ఫ్రెంచి మంత్రిని పిలిచి, మొరాకో పరిస్థితిపట్ల తమ ఆందోళనను వెలిబుచ్చారు.

### అల్జీరియన్లకు ఉరి శిక్షలు

అల్జీరియాలో గత నవంబరులో జరిగిన అల్లర్లలో పాల్గొన్నట్లు తాము భావిస్తున్న వారిలో 28 మందికి ఫ్రెంచి సైనిక న్యాయస్థానం ఉరి శిక్షలు విధించింది. ఇందులో 16 మంది దొరకలేదు. వీరిగాక మరో నల్గురిని కఠిన కారాగారానికి పంపించింది.

మొరాకోలో కాసబ్లాంకా అరబ్బుపేటలో పోలీసులు నేడు కాల్పులు సాగించిన కారణంగా 5 గురు మొరాకో వారు చనిపోయినారు. ముగ్గురు తీవ్రగాత్రులయినారు.

ఫ్రెంచి పోలీసులు పోతున్న కారు మీద ఎవరో చేతిబాంబు విసిరినందువల్ల ఈ కాల్పులు సాగాయి. చేతిబాంబు పేలటంమూలంగా పోలీసు కారులోని 5 గురు ఫ్రెంచి పోలీసులకు ఒక ఫ్రెంచి సంఘ సేవకురాలికి దెబ్బలు తగిలాయి. అందర్నీ ఆస్పత్రిలో చేర్చారు. పోలీసుల్లో ముగ్గురి స్థితి ప్రమాదంగా వుంది.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: దేశంలో వరదల స్థితిని ఈ సమావేశంలో చర్చించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ సత్యనారాయణ్ సిన్హా లోక్ సభలో తెలియజేశారు.

# ఫజులాలీ సంఘ సిఫార్సులు

## హైదరాబాదు ముఖ్యమంత్రికి తెలియవు

### అక్టోబరులో కాంగ్రెసు సంఘం చర్చ

హైదరాబాద్, సెప్టెంబరు 9: రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం నివేదికను అక్టోబరులో జరగనున్న సమావేశంలో అఖిల భారత కాంగ్రెసు సంఘం చర్చిస్తారని హైదరాబాద్ ముఖ్యమంత్రి డాక్టరు బి. రామకృష్ణారావుగారు పత్రికా విలేఖరులకు చెప్పారు.

హైదరాబాద్ రాష్ట్రాన్ని విభజించి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పాటుచేయవలసిందిగా సిఫార్సు చేయనున్నారని "చాలా నమ్మకంగా" తెలియవచ్చిందని ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు గుంటూరులో చేసిన ప్రకటనను దృష్టికి తీసుకురాగా ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు ఇట్లా అన్నారు: "అటువంటిదేమీ నాకు తెలియదు. రకరకాల వదంతులు ప్రచారంలోకి వస్తున్నవి. ఆ సంఘం ఏమి సిఫార్సు చేయనున్నదీ ఢిల్లీలోకూడా ఎవరికీ తెలియదనుకుంటాను. ఏ సిఫార్సు చేసినప్పటికీ పేచీ లేమీ పెట్టకుండా ప్రజలు వాటిని ఆమోదించాలి.

# ఉత్తరాఫ్రికా సమస్యలు

## భారత ప్రభుత్వశ్రద్ధ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: మొరాకో, అల్జీరియాలలో జరుగుతున్న సంఘటనల పట్ల భారత ప్రభుత్వం ప్రగాఢ తన ఆందోళనను వెల్లడించిందనీ, ఆ దేశాలలో జాతీయ వాదులకు ఆమోద యోగ్యమయిన పరిష్కారం తొందరగా కుదుర్చుకోవటం అవసరమనికూడా తెలిపిందనీ ఇవ్వాళ అధికారికంగా తెలిసింది.

పారిస్‌లోని భారత రాయబారి ఫ్రెంచి ప్రభుత్వంతో ఇష్టాగోష్ఠిగా సంప్రదిస్తున్నట్లు కూడా తెలిసింది.

సమితిలో భారతదేశం ఉత్తరాఫ్రికా సమస్య విషయంలో ఆసియా-ఆఫ్రికా బృందానికి పూర్తి మద్దతు ఇచ్చింది. ఆ బృందంలోని ఇతర సభ్యులతో కలిసి రేపు 20 వ తేదీన ప్రారంభమయ్యే సర్వప్రతినిధి సభలో ఉత్తరాఫ్రికా సమస్యను చర్చించాలని కోరింది కూడాను. ఈ సందర్భంలో భద్రతా మండలికి ఒక విజ్ఞాపికను పంపటానికి కూడా ఆ బృందంతోపాటు సమ్మతించింది. ఇందునిమిత్తం భారత ప్రతినిధి శ్రీఅర్జర్ లాల్ అధ్యక్షతను 6 గురుసభ్యులతో ఒక సంఘంఏర్పడి ఆ విజ్ఞాపికను తయారుచేస్తున్నది. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ మొన్న 6 వ తేదీని రాజ్యసభలో ఉత్తరాఫ్రికాలో ఇటీవలి సంఘటనలపట్ల ఆందోళన వెల్లడించి వున్నారు.

# హైదరాబాదు ప్రణాళిక రూ 133 కోట్లకు కుదింపు

## ముఖ్యమంత్రి ప్రకటన: సింగరేణి అభివృద్ధికి రూ 9 కోట్ల అప్పు

### నాగార్జున సాగరం, దేవనూరు, పూర్ణా ప్రాజెక్టులకు స్థానం

హైదరాబాద్, సెప్టెంబరు 9: హైదరాబాదులో అమలు జరగవలసిన రెండవపంచవర్ష ప్రణాళిక గరిష్ఠ ప్రమాణం రు. 113 కోట్లని ప్లానింగ్ కమిషన్ తాత్కాలికంగా నిర్ణయించారని ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు చెప్పారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను ప్లానింగ్ కమిషన్‌తోనూ, భారతప్రభుత్వంతోనూ చర్చించి రామకృష్ణారావుగారు నిన్న తిరిగివచ్చారు. ఆయన ఇట్లా చెప్పారు:

"రాష్ట్ర ప్రణాళికలకు మొత్తం రూ. 2,250 కోట్లు కేటాయించారు. ఇందులో హైదరాబాద్ రాష్ట్రప్రణాళికకు రూ. 113 కోట్లకంటె ఎక్కువ ఖర్చు కారాదని నిర్ణయించారు. నాగార్జునసాగర్, పూర్ణ, దేవనూరు (3 పెద్ద ప్రాజెక్టులు) ప్రాజెక్టులను ప్రణాళికలో చేర్చారు."

చిన్న, కుటీరపరిశ్రమలకు ప్రణాళికలో సుమారు రూ. 6 కోట్లు కేటాయించారు. సింగరేణి కాలరీలను అభివృద్ధిచేసేనిమిత్తం రాష్ట్రప్రభుత్వానికి భారతప్రభుత్వం సుమారు రు. 9 కోట్లు అప్పుగా ఇచ్చే అవకాశం కనిపిస్తున్నది.

### ఎర్రకాల్వను తక్షణం అదుపుచేయాలి

## శ్రీ చంద్రమౌళి వివరణ

కర్నూలు, సెప్టెంబరు 9: డెల్టాప్రాంతాలలో వరదబాధ యేర్పడకుండా శాశ్వత నివారణపద్ధతులను అనుసరించి పనులు జరిపించవలసివున్నదని రెవిన్యూ మంత్రి శ్రీ కె. చంద్రమౌళి అన్నారు. శ్రీ చంద్రమౌళి వరదబాధిత ప్రాంతాలలో 5 రోజులు పర్యటించి నేడు వచ్చారు.

పత్రికాప్రతినిధులతో మాట్లాడుతూ ఎర్రకాల్వమీద డాము, రిజర్వాయరుకట్టి, వెంగాట్లను బలపరచవలసి వున్నదనీ, యిది అవశ్యం జరుగవలసివున్న వరదనివారణ చర్య అని తెలియజేశారు.

"ఈవరదల మూలంగా ఎంత నష్టం వాటిల్లినదో తేల్చాలంటే వరదనీరు తీసేదాకా ఆగవలసివుంది. ఇప్పుడు దాదాపు 30 వేల ఎకరాల సేద్యపు భూమి మునిగిపోయింది. దాదాపు 3 వేల పాకలు పడిపోయినాయి. రెవిన్యూ ఉద్యోగులు జేవస్థానం ఉద్యోగులు సహాయ కార్యక్రమాలు నడిపిస్తున్నారు. ఇంతవరకు ఈబాధితులకు సహాయం చేసే నిమిత్తం వస్త్రాలు, బియ్యమూ కాక రూ 4 వేలు గూడా వసూలైనాయి. స్థానిక వరదబాధ నివారణ సంఘాలు గూడా బాగా పనిచేస్తున్నాయి" అని ఆయన చెప్పారు.

గోదావరి ఇంకా వరదమీద వున్నందువల్ల తమకు భద్రాచలందాకా పోయిరావటం పడలేదని, కాని తమకు అందిన సమాచారాన్ని బట్టి అక్కడ ఇద్దరు మనుష్యులు చనిపోయినట్లు 9 పశువులు మరణించినట్లు తెలుస్తున్నదని తెలియజేశారు.

### ఎరువులధర తగ్గించే ఆలోచన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9. ఎరువుల ధరలను తగ్గించటంలో సాధ్యాసాధ్యాలను ప్రభుత్వం పరిశీలిస్తున్నదనీ, 'సహాయంచేసి' ధరలు తగ్గించేపద్ధతి ప్రవేశపెట్టే వుద్దేశం ఏమాత్రం లేదనీ ఆహార వ్యవసాయమంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ ఇవ్వాళ లోక్‌సభలో తెలియజేశారు. నిర్ణయం త్వరలోనే జరుగుతుందన్నారు.

### హైదరాబాద్ మార్కెట్ ధరలు

(కొత్తూరి సీతయ్య కొట్టు)

హైదరాబాద్, సెప్టెంబరు 9:

| | |
|---|---|
| పసుపుపల్లా | 185-0-0-218 |
| పెసలు | |
| కందులు | 34-0-0-35-14-0 |
| మినుములు | 36-0-0-39-0-0 |
| ఉలవలు | 26-0-0-26-8-0 |
| లంకలు | 21-0-0-22-8-0 |
| కందిపప్పు పెద్దది | 45-46 |
| కందిపప్పు చిన్నది | 48-0-0-48-0-0 |
| పెసరపప్పు | 40-0-0-42-0-0 |
| వేరుశెనగపప్పు | 48-48-8-0 |
| మినప పప్పు | 55-60 |
| ఆముదాలు | 31 |
| చింతపండు | 27-0-0-31 |
| పిప్పి | 140-260 |
| కుసుములు | 27-0-0-27-12-0 |
| ధనియాలు | 10-4-0-10-12-0 |
| ఆవాలు | |
| ఉల్లగడ్డలు | 18-0-0-21-0-0 |
| నువ్వులు | 66-80 |

# పాక్ ఆఫ్ఘన్ తగాదా

## పరిష్కార మవుతున్నట్లు వార్త

కరాచీ, సెప్టెంబరు 9: కాబూలులో జరిగిన 'పతాక సంఘటన' సందర్భంలో పాక్, ఆఫ్ఘన్ ప్రభుత్వాలకు తాత్కాలిక సమాధానం ఒకటి కుదిరినట్లు అధికారికంగా తెలిసింది.

ఆఫ్ఘన్ విదేశాంగమంత్రి సర్దార్ నయీమ్‌ఖాన్, అక్కడి పాక్ రాయబారి కల్నల్ షా జరిపిన సంప్రదింపుల మూలంగా ఇది కుదిరిందట. ఇక ఈ విషయమై కరాచీలో ఆఫ్ఘన్ రాయబారికీ పాక్ ప్రభుత్వానికీ మధ్య సంప్రదింపులు జరగగలవని అనుకొంటున్నారు.

### రుమేనియా ప్రవాసులు

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 8: ఏకారణాలవల్లనయినా కానీ, విదేశాల్లో ప్రవాసం ఉంటున్న రుమేనియన్ ప్రజలు ఏతప్పులు చేసివున్నా, వాటన్నిటినీ రుమేనియా ప్రభుత్వం క్షమిస్తుందనీ కాబట్టి వాళ్లంతా తిరిగి స్వదేశానికి రావాలనీ కోరుతూ రుమేనియా ప్రభుత్వం ఒకప్రకటన చేసింది. ఢిల్లీలోని రుమేనియాప్రతినిధి వర్గాల ద్వారా ఇది తెలిసింది.

### జీవితంలో కల్లా ఘనకార్యం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: కాంబోడియాలో అంతర్జాతీయ యుద్ధవిరమణ పర్యవేక్షణ సంఘంలో పనిచేస్తున్న ఒక భారతీయ సైన్యపు కాప్టెన్, కాంబోడియా రాజవంశీకురాలిని ఒకతెను పెళ్లిచేసుకున్నట్లు వార్తలు వచ్చినవి.

ఈఊళ్లో వ్యాపారస్తుడుగా ఉన్న ఆకాప్టెన్ తండ్రి ఈవార్త వినగానే "మాఅబ్బాయి ఇంతవరకు జీవితంలో కల్లా సాధించిన ఘనకార్యం ఇదే. ఒహుశా వాడు శాంతి, స్నేహ విధానాన్ని అమలు జరుపుతున్నాడనుకుంటాను" అని వ్యాఖ్యానించాడు.

### సమాధానపురం వ్యక్తి ఉరిశిక్ష అమలు

కర్నూలు, సెప్టెంబరు 9: పల్నాడు తాలూకా గొట్టుముక్కల శివారు సమాధానపురం గ్రామస్థుడు దాచేపల్లి హీరయ్య (సైరోడు) కు విధించిన ఉరి శిక్షను, 6 వ తేదీన రాజమండ్రి జైలులో అమలుపరిచారు. సమాధానపురం గ్రామస్థురాలైన కటికల ముత్తెమ్మను హత్యచేసినందుకు యీ శిక్ష విధించబడింది.

### తిరుగుబాటు సోషలిస్టులకు హెచ్చరిక

హైదరాబాద్, సెప్టెంబరు 8: మదరాసులో ఇటీవల జరిగిన ప్రజాసోషలిస్టుపార్టీ 'తిరుగుబాటుదారుల' సమావేశానికి హాజరైనవారందరూ కేంద్ర పార్టీ కార్యాలయం జారీచేసిన సర్క్యులర్ ప్రకారం ప్రజాసోషలిస్టు పార్టీ సభ్యత్వం కోల్పోతారని హైదరాబాద్ రాష్ట్రపార్టీ అధ్యక్షుడు శ్రీరామమూర్తినాయుడు ఒక ప్రకటన చేశారు. ఆ ప్రకటనలో ఇట్లా ఉన్నది: "1947 లో సోషలిస్టులు కాంగ్రెసునుంచి వైదొలగి బయటికి వచ్చినప్పుడు బహిరంగంగా ఆ విషయం చెప్పి వేరే పార్టీ పెట్టుకున్నారేగాని రెండువాపుల దూడలుగా ప్రవర్తించలేదు. సంస్థకు ద్రోహం చెయ్యలేదు. పార్టీకి ఎదురు తిరుగుతున్న సభ్యులు ఈ విషయం గమనించాలి"

### మదరాసు ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన సమితి

మదరాసు, సెప్టెంబరు 9: మద్రాసు స్వామి శ్రీ డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడు 10వ తేదీ సాయంత్రం 4-30 గం||కు ఆంధ్రవిద్యార్థి విజ్ఞానసమితి ప్రారంభోత్సవం మద్రాసు న్యాయకళాశాలలో జరపుతారు. శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య అధ్యక్షత వహిస్తారు. సమారి వింజమూరి లక్ష్మి, సరస్వతి, వల్లూరి శకుంతలలు గానము చేస్తారు.

# డాక్టర్ల సమ్మె

అహమ్మదాబాదు, సెప్టెంబరు 9 — అహమ్మదాబాదుపురపాలక సంఘంవారు పుతున్న వాడీలాల్ సారాభాయ్ ఆసుపత్రిలో గౌరవ వైద్యులను ఆ ఆస్పత్రి నిర్వాహకసంఘం హీనంగా చూస్తున్నారని నగరంలో 300 మంది డాక్టర్లు నేడు తమ చికిత్సాలయాలను మూసేశారు. ఈసమ్మెఅహమ్మదాబాదు వైద్యసంఘం అధ్వర్యాన సాగుతోంది. భారతదేశంలో డాక్టర్లు సమ్మెచేయడం ఇదే మొదటిసారి.

డాక్టరు అమ చికిత్సాలయాలను అయితే మూసివేశారుగాని, చాలా అవసరంగా చికిత్స కావలసిన రోగులను చూస్తామనీ, ఆస్పత్రులలో తమపనిని నిర్వహిస్తూనే వుంటామని ఒక ప్రకటనచేశారు.

గౌరవ పారితోషికం మొదలైన విషయాలమీద తగాదా వచ్చి 15 మంది డాక్టర్లు రాజీనామాలు పంపగా,ఆస్పత్రి నిర్వాహకసంఘం ఆ రాజీనామాలను ఆమోదించడమే గాక అసలు గౌరవ వైద్యుల పదవిని ఎత్తివేయడానికి నిర్ణయించుకున్న కారణంగా ఈ సమ్మె ప్రారంభమైంది.

### కళా వెంకట్రావుగారు

కర్నూలు, సెప్టెంబరు 9. కళా వెంకట్రావుగారికి యివ్వాళ ఎక్కువ జ్వరము తగ్గినది. ఈ ఉదయం ఆంధ్ర గవర్నరు శ్రీ త్రివేది యింటికి వచ్చి, వెంకట్రావుగారిని చూసి వెళ్లారు. రెవిన్యూ మంత్రి చంద్రమౌళిగారు కూడా ఉదయం వెళ్లి వెంకట్రావుగారిని చూసివచ్చారు.

# విశాఖలో ఉద్యోగుల భీమా పథకం

## అక్టోబర్ 2 న భారత కార్మిక మంత్రిచే ప్రారంభోత్సవం

మదరాసు, సెప్టెంబరు 9: ఉద్యోగుల బీమాపథకాన్ని విశాఖపట్నంలో భారత కార్మిక మంత్రి శ్రీ ఖండూభాయి దేశాయి అక్టోబరు 7 వ తేదీ ప్రారంభం చేస్తారనిఅధికారరీత్యా తెలిసింది.

ఆంధ్ర రాష్ట్రంలో 8 నిర్ణీతమైన ప్రాంతాలలో దాదాపు 70 పారిశ్రామిక సంస్థలలో పనిచేసే సుమారు 18 వేలమంది కార్మికులకు యీ పథకం వర్తిస్తుంది. మద్రాసు ఏడు కేంద్రాలలో కోయంబత్తూరులో యిదివరకే అమలులో ఉంది. మదరాసునగరంలో పరిపూర్ణంగా త్వరలోనే దానిని వర్తింపచేస్తారు.

### కంపెనీల బిల్లు

న్యూఢిల్లీ, సెప్టెం 9. లోక్ సభ యివాళ కంపెనీల బిల్లులోని ఇంకా 40 నిబంధనలు ఆమోదించింది. అంటే మొత్తం యింతవరకూ 649 నిబంధనలు లోక్ సభ ఆమోదించిందాయి.

# వరదలలో చిక్కుకున్న వారికి విమానాల ద్వారా ఆహార సప్లయ్

## ఒరిస్సాలో ఇంకా కుంభవర్షం

కటకం, సెప్టెంబరు 9: వరద ప్రవాహం చుట్టుముట్టి, ఎటు పోవటానికీ దారిలేకుండా అక్కడక్కడ నిలిచిపోయిన వేలాది ప్రజలకు నిన్నా, ఇవ్వాళ విమానాల ద్వారా ఆహారం అందచేస్తున్నారు.

భారత వైమానికదళానికి చెందిన మూడు విమానాలు, నిన్న 20 టన్నుల ఆహార పదార్థాలనూ, ఇవ్వాళ మధ్యాహ్నం వరకూ 15 టన్నుల ఆహార పదార్థాలనూ క్రిందుగా రొంటుతూ వెళ్ళి ఆయా స్థలాలలో పడవేశాయి. ఈ ప్రజలలో కొందరు అయిదారు రోజులుగా పస్తులుంటున్నట్లు కూడా తెలిసింది. ఇవ్వాళ ఇంకా 30 టన్నుల ఆహారపదార్థాలను తీసుకువెళ్ళి పడవేస్తాయని తెలిసింది.

### వర్షం కురుస్తూనే ఉన్నది

వర్షం ఇంకా కురుస్తూనే వున్నందున ఈ ప్రజలను సురక్షిత ప్రాంతాలకు చేర్చే ప్రయత్నం ఇవ్వాళ సాగలేదు. నిన్న భరత సైన్యానికీ పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికీ చెందిన రక్షణ పడవలు చాలాచోట్లకు వెళ్ళి చాలామందిని సురక్షిత స్థలాలకు చేర్చాయి.

గతరాత్రి మహానది ప్రవాహం 70.5 అడుగుల ప్రమాణంలో వుంది. ఇది ప్రమాద ప్రమాణానికి 2.5 అడుగులు తక్కువ.

కటకం, పూరీ, బాలసూరు జిల్లాలలోని కోర్టులన్నీ టెనీ మూసివేయవలసిందని హైకోర్టు ఉత్తరువు చేసింది. తెరా పరిస్థితిని గురించి ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి తెలియచేసింది. రక్షణ కార్యకలాపాలు సాగించేందుకు ఇంకా పడవలు కావాలి. కనుక వెంటనే పంపవలసిందని రక్షణశాఖను కోరింది.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ఇతర రాష్ట్ర ప్రభుత్వాధిపతులూ వరదలవల్ల కష్టనష్టాలకు గురి అయిన ప్రజలకు సానుభూతి తెలుపుతూ సందేశాలు పంపారు.

### ప్రజల అవసలు

నిన్న సురక్షితస్థలాలకు చేర్చబడిన వారిస్థితీ, వారు చెప్పే సంగతులూ వింటే కడుపు తరుక్కుపోతోంది. ఒక ముసలమ్మ తాను డబ్బు దస్కం దాచుకొన్న పెట్టె కొట్టుకుపోయిందని తెలిసేసరికి స్పృహ లేకుండా పడిపోయింది. ఇద్దరు పిల్లలు నీళ్ళు వస్తుంటే తాను ఎత్తుగావున్న ప్రదేశానికి పరుగెత్తారనీ, ఇంతవరకూ వాళ్ళ అమ్మగారు ఏమయారో తెలియలేదనీ అన్నారు. వరద ప్రాంతాలనుంచి రక్షించి తీసుకువచ్చినవారిని వుంచిన చోట చాలా కొన్నాపులు జరిగాయి.

### బాధితులకు ఆంధ్ర గవర్నరు విరాళం

కర్నూలు, సెప్టెంబరు 9: ఒరిస్సాలో వరదలవల్ల విపరీతనష్టం వాటిల్లిందన్న వార్త వచ్చీ రావటంతోనే బాధితుల సహాయార్థం ఆంధ్రగవర్నరు శ్రీ సి. ఎం. త్రివేది లాంఛన విరాళంగా వెయ్యి రూపాయలు ఒరిస్సా గవర్నరుకు పంపారు.

భారత రెడ్‌క్రాస్ సంఘం ఆంధ్ర రాష్ట్రశాఖ అగ్యక్షిణి శ్రీమతి కుసుం త్రివేది 20 పీపాల పాలపొడి పంపించారు.

## పచ్చయప్ప ఉన్నత పాఠశాల తెలుగు సంఘం

మదరాసు, సెప్టెంబరు 8: పచ్చయప్ప ఉన్నతపాఠశాల ఆంధ్ర భాషాభిరంజక సమాజంలో నిన్న సాయంత్రం త్యాగరాయ కాలేజీ ఆంధ్ర భాషా శాఖాధ్యక్షులు శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య తెలుగుభాష పుట్టుపూర్వోత్తరములను తెలుగు ప్రాముఖ్యమును గ్రంథముల ప్రాశస్త్యమునుగురించి విద్వాంసుల అభిప్రాయములను విద్యార్థులకు వివరించి చెప్పారు.

శ్రీ తెన్నేటి జీనదయాళునాయుడు వందనలర్పించారు.









Printed and Published for NageswaraRao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St, Madras - 1. Editor S. Sambhu Prasad

## ఢిల్లీ ఆంధ్ర విద్యాలయం

### 'రామకృష్ణ హాలు'కు ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: "ఢిల్లీలో ఆంధ్రులు ఇంత చక్కని భవనం నిర్మించుకొని, ఆంధ్ర సంస్కృతి ప్రచారం కోసం కృషిచేస్తున్నందుకు నా కెంతో ఆనందంగా ఉంది. ఈ విద్యాలయానికి ఆంధ్ర ప్రభుత్వం రూ. 50 వేలు మంజూరుచేసింది" అని స్థానిక ఆంధ్ర విద్యాలయ భవనంలోని 'రామకృష్ణ' హాలుకు 4 వ తేదీ ఉదయం ప్రారంభోత్సవంచేస్తూ ఆంధ్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు అన్నారు. ఈ హాలు నిర్మాణానికి జిలగపూడి రామకృష్ణగారు రూ. 40 వేలు విరాళం ఇచ్చారు.

శ్రీమతి దుర్గాబాయ్‌దేశ్ ముఖ్ సభ్యులకు స్వాగతంఇస్తూ ప్రకాశం మంత్రివర్గం ఆంధ్ర విద్యాలయసంస్థకు, లక్ష రూపాయల విరాళంఇచ్చిందనీ దానితో ఈసంస్థ చక్కని భవనాలు నిర్మించుకో గలిగిందనీ, ఇంకా ఎంతోమంది ఉదారులీ సంస్థకు సహాయంచేశారనీ అన్నారు. పిమ్మట విద్యాలయసంస్థ అధ్యక్షులు మాడభూషి అనంతశయనంఅయ్యంగారు ప్రసంగిస్తూ సంస్థఅభివృద్ధికి దోహదంఇచ్చినవారికి ధన్యవాదాలర్పించారు.

ఈ సమావేశానికి నీలం సంజీవరెడ్డి, కళా వెంకటరావు, గౌతు లచ్చన్న, న్యాయమూర్తి బచ్చు జగన్నాథదాస్, కేంద్ర ఆర్థిక మంత్రి చింతామణి దేశముఖ్, పట్టాభిరామారావు, పళ్లంరాజు, ప్రభృతులనేకులు హాజరైనారు. అల్పాహారవిందుతో సమావేశం ముగిసింది.

## కంపెనీల రద్దు తతంగం

### ఉద్యోగులపై చర్యకు అవకాశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: కంపెనీల ఎత్తివేత సందర్భంలో నియమింపబడే లిక్విడేటర్ల అక్రమ ప్రవర్తన గురించి ఒకరు ఫిర్యాదు చేయకుండానే స్వయంగా పూనుకొని, పరిశీలన జరిపించే అధికారం ప్రభుత్వానికి యిచ్చే ఒక కొత్త నిబంధనను కంపెనీల చట్టంలో చేర్చటానికి లోక్ సభ నేడు సమ్మతించింది. ఈ నిబంధన 460 ఎ. గా పరిగణిత మవుతుంది.

ఈ విషయంలో అసలు శ్రీ హెచ్. వి. కామత్ నిన్న 516 వ నిబంధనకు ఒక సవరణను ఉపపాదించారు. ఆ సవరణను సూత్రప్రాయంగా ప్రభుత్వం ఆమోదిస్తుందని శ్రీ ఎం. సి. షా అని ఉన్నారు. అందుచే నిన్న ఆ నిబంధనపై ఓటింగును కూడా వాయిదా వేశారు.

ఇవ్వాళ శ్రీ షా, శ్రీ కామత్ సవరణ ఆధారంగా తాము తయారు చేసిన సవరణ 460 వ నిబంధన తర్వాత బాగా ఇముడుతుందని కనక అక్కడ వేరే నిబంధనగా దీనిని ప్రవేశపెట్టాలని ఉపపాదిస్తున్నామనీ అన్నారు. దానికి సభవారు ఆమోదించారు.

## గోవింద్ స్వామినాథన్ కోర్టుధిక్కార నేరం

న్యూఢిల్లీ సెప్టెంబర్ 7: కోర్టు ధిక్కారనేరం క్రింద రూ. 1000 జరిమానా చెల్లించాలని మద్రాసు హైకోర్టు తనపై విధించిన శిక్షపై మద్రాస్ ప్రభుత్వ ప్రాసిక్యూటర్ శ్రీ ఎస్. గోవిందస్వామినాథన్, అప్పీలు చేసుకునేందుకు సుప్రీంకోర్టు అనుమతించింది.

1954 ఏప్రిల్ 30వ తేదీన ఒక క్రిమినల్ దావా విచారణలో శ్రీ స్వామినాథన్ మాటలు కొన్ని కోర్టును ధిక్కరించేవిగా ఉన్నవని మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీమాక్ ఈ శిక్షను విధించారు.

## రష్యా విషయం

### కొంత ఓర్పు వహించాలని హితవు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: "భారత దర్శనం" అన్న తన గ్రంథంలో భారత కమ్యూనిస్టు పార్టీని గురించి వున్న మాటలను త్రిప్పి వ్రాయవలసిందిగా రష్యాలో తనను ఎవ్వరూ కోరి ఉండలేదని ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ నేడు లోక్ సభలో చెప్పారు.

శ్రీ కామత్, ఎవరైనా మీ భారత దర్శన గ్రంథంలో కమ్యూనిస్టు పార్టీని గురించి వున్న మాటలను దిద్దవలసిందని కోరారా అని అడిగారు.

ప్రధాన మంత్రి ఈ ప్రశ్నకు సమాధానం ఇస్తూ "గౌరవ సభ్యుని ఊహలు రెక్కలు కట్టుకు ఎగురుతున్నాయని, తాను ఇదివరకు ఎప్పుడు ఇటువంటి సూచన వినలేదు, ఇదేపనడం" అన్నారు.

తర్వాత శ్రీ కామత్ రష్యాలో రైల్వేలలోను, పుస్తకాల దుకాణాలలోను భారతదేశం పుస్తకాల అమ్మకంపైన నిర్బంధాలు యేమన్నా ఉన్నాయా అని అడిగారు. ఆ విషయానికి సంబంధించిన సమాచారాన్ని పోగుచేస్తున్నామని, పూర్తికాగానే సభవారికి తెలియజేస్తామని పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సాదత్ అలీఖాన్ సమాధానంఇచ్చారు.

మహాత్మాగాంధీ రచనలు, నేతాజీ సుభాస్ బోసురచనలు, సంత్ తుకారాం రచనలు రష్యాలో అమ్ముతారా, లేక అక్కడ వాటిని నిషేధించారా అని, గాంధీజీని వారు "మతనాయకుడు" అని నేతాజీని "ఫాసిస్టు" అని, తుకారాంను "మిస్టిక్ నాన్సెన్స్" అని అంటూవుంటారు గనుక ఇట్లా అడుగుతున్నానని శ్రీ కామత్ ఇంకో ప్రశ్న వేయగా శ్రీ సాదత్ అలీ ఆయనను కొంచెం ఓర్పు వహించమని కోరారు.

## రైళ్లలో భోజనం నాణ్యత, ధరలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: రైలు బండ్లలో ఆహార పొట్లాలు చౌకగా అమ్మడం త్వరలో ప్రారంభమవుతుందని శ్రీ అలగేశన్ నేడు రాజ్యసభలో శ్రీ మాథుర్‌కు చెప్పారు. రైలుబండ్లలో ప్రస్తుతం ఎక్కువ ధరలకు అహార పొట్లాలు విక్రయిస్తున్నారని పీటిని త్వరలో తగ్గించవలసివున్నదనీ రైల్వే మంత్రి శ్రీ లాల్‌బహాదూర్‌శాస్త్రి అంతకుముందు అంగీకరించారు.

'అన్నపూర్ణ డైనింగ్ కార్లు'నుఎక్కువగా ఎందుకు తగిలించకూడదు? అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ "అది చౌకే. అంగీకరిస్తాను. కాని ఆహారం రుచి నాణ్యంగురించి చెప్పలేను" అన్నారు.

## సాంకేతిక విద్యా పరిషత్తు

### సమితి ద్వారా రష్యా సహాయంతో ఏర్పాటు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: సమితి విద్యాసాంస్కృతిక సంఘంతో సంప్రదించి వారి అధ్వర్యాన ఒక ఉన్నత సాంకేతిక విద్యా పరిషత్తును రష్యా ఇచ్చే సహాయంతో స్థాపించడం నిమిత్తమై మంతనాలు జరపడానికి భారత ప్రభుత్వ ప్రతినిధివర్గం రేపు పారిస్‌కు వెళ్లుతున్నది.

ఈ ప్రతినిధివర్గంలో డా॥ ఎస్. ఆర్. సేన్ గుప్తా, శ్రీ జి. కే. చండీరామాని, డా॥ పి. కే. కేల్కార్ వున్నారు. వీరు పారిస్‌లో సమితి విద్యా సాంస్కృతిక సంఘంతో చర్చించి, అక్కడినుంచి మాస్కోకు బయలుదేరిపోతారు. వీరితో పై సంఘం ప్రతినిధులు గూడా కొంతమంది మాస్కోకు పోతారు. ఈ సాంకేతిక విద్యా పరిషత్తును బొంబాయిలో నెలకొల్పాలని ప్రభుత్వం సంకల్పించింది.

## మహా నాయకుల వాణి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: మహాత్మాగాంధీ, శ్రీమతి సరోజినీనాయుడు, శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్, సర్దార్ పటేల్, ఆంధ్రూస్, శ్రీనివాస శాస్త్రి, నానాలాల్ కవిగారల ప్రసంగాల రికార్డులు పదిలపరుస్తామని శ్రీ బి. వి. కేస్కర్ నేడు లోక్ సభలో శ్రీ ఝూలన్‌సిన్హాకు తెలియజేశారు. నేతాజీ బోసు ప్రసంగాల రికార్డులు ఎక్కడయినా లభిస్తే వాటినికూడా పదిలపరుస్తామని శ్రీ కామత్ ప్రశ్నకు సమాధానమిస్తూ అన్నారు.

## హైదరాబాదులో శరణార్థుల పునరావాసం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: తూర్పు పాకిస్థాన్ శరణార్థులకు పునరావాసం కల్పించడానికి హైదరాబాదులో అనువైనచోట భూమిని సేకరించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవని కేంద్ర పునరావాస శాఖామంత్రి శ్రీ మెహర్ చంద్ ఖన్నా నేడు లోక్‌సభలో శ్రీ గిద్వానీకి తెలియజేశారు.

## జాతీయ నాటకప్రణాళిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: జాతీయ నాటక ప్రణాళిక అమలుజరపడానికి తగిన చర్యలు తీసుకొంటున్నామనీ, వివరాల విషయంలో పరిశీలన జరుగుతున్నదనీ, మొదటగా హిందీలో యీ కార్యక్రమం అమలు జరగగలదనీ రాజ్యసభలో సమాచారశాఖ మంత్రి పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ జి. రాజగోపాలన్ చెప్పారు.

ఆంధ్రరాష్ట్రముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు నిజాంకళాశాల తెలుగు సారస్వతసమితికి ప్రారంభోత్సవంచేశారు.

గుంటూరుజిల్లా పచ్చలతాడిపర్రు గ్రామంలోని కస్తూర్బా హరిజన బాలిక వసతిగృహం పరిశ్రమలశాఖకు జిల్లా కలెక్టరు సతి శ్రీమతి ప్రమీలా భగవాన్‌దాసు ఇటీవల ప్రారంభోత్సవం చేశారు.

## వర్తకులలో పదవీ విరమణ! లేదని శ్రీ దేశ్‌ముఖ్ విచారం

### వర్తక పుత్రులు యాత్రలు చేస్తున్నారట

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: వర్తకం చేసేవారు వృత్తినుంచి విరమించడం అనేది లేకపోతున్నందుకు ఆర్థికమంత్రి శ్రీ దేశ్‌ముఖ్ విచారం వెల్లడించారు.

కంపెనీల బిలులో చేర్చిన 'సలహా సంఘం' ఏర్పాటులో వర్తకులకు గూడా ప్రాతినిధ్యం ఉండాలన్న విషయాన్ని గురించి మాట్లాడుతూ యిది చాలా కష్టమయిన విషయంగా ఉన్నదని, "రిటైర్డు" వర్తకుడు అంటూ ఎవరన్నా ఉంటే అతనికి ఆసంఘంలో ప్రాతినిధ్యం కల్పించడానికి అభ్యంతరం ఏమీ వుండదుగాని, వర్తకులలో "రిటైరు" అయినవాడంటూ కన్పించడమే కష్టమని ఆయన అన్నారు.

ఉపాధ్యక్షుడు: కొడుకుకు 25 ఏళ్లు రాగానే వర్తకం అతనిచేతుల్లో పెట్టి వృత్తిలోంచి 'రిటైరు' అయినవారికి ఈ సంఘంలో సభ్యత్వం ఇవ్వవచ్చు ననుకుంటాను.

శ్రీ దేశముఖ్: ఇప్పుడు వర్తకుల కొడుకుల విషయంలో గూడా ఒక కష్టం కన్పిస్తోంది. వారు చేసేపనులు: యాత్రలుచేయడం, లేదా రాజకీయాలలో తిరగడం. వర్తకం జోలికిమాత్రం పోవడంలేదు. అందువల్ల అక్కడగూడా చిక్కువస్తోంది.

## నాగాల పోరాటాలలో జరిగిన నష్టాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: ఈ ఏడాది ప్రారంభంనుంచి జులై మధ్యకాలం వరకు నాగాలకు అస్సాం రైఫిల్ దళాలకు జరిగిన 9 పోరాటాలలో మొత్తం రెండువైపులా 86 మంది మరణించారని 22 మంది గాయపడ్డారని ప్రధాని శ్రీ నెహ్రూ నేడు లోక్‌సభలో చౌదరీ మహమ్మద్ షాఫీకి తెలియజేశారు.

"12 మంది గ్రామస్థులతో సహా ప్రభుత్వ పక్షాన మొత్తం 22 మంది మరణించారు. గాయపడ్డవారు 10 మంది. నాగాలలో చనిపోయినవారు 14 మంది, గాయపడ్డవారు 12 మంది" అని లిఖిత పూర్వకంగా వివరాలు తెలియజేశారు.

## పశ్చిమ బెంగాలులో నేరాలు

కలకత్తా, సెప్టెంబరు 8: పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో 1953-54 సం॥ లో 442 హత్యలు, 707 దోపిడీలు, 996 బందిపోటు దొంగతనాలు, 605 దొంగతనాలు, 431 అపహరణ నేరాలు జరిగాయని పశ్చిమ బెంగాల్ ముఖ్య మంత్రి డా॥ బి. సి. రాయ్, రాష్ట్ర శాసనసభలో వెల్లడించారు. 24 పరగణాల జిల్లాలో అన్ని జిల్లాలలో కన్నా ఎక్కువ నేరాలు జరిగాయి.

## 25000 వ బుద్ధ జయంతి

### డాక్టరు రాధాకృష్ణన్ అధ్యక్షతన సంఘం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: ముందు సంవత్సరంలో వచ్చే 25000 బుద్ధ జయంతి జరపడానికి భారత ఉపాధ్యక్షులు డాక్టరు రాధాకృష్ణన్ అధ్యక్షతలో ఒక ఉన్నతస్థాయి సంఘం ఏర్పాటుచేశారు.

ఈ సంఘంలో బీహార్, ఉత్తర ప్రదేశ్, భోపాల్ రాష్ట్రాల ముఖ్య మంత్రులు సభ్యులుగా ఉన్నారు. లోక్ సభలో ప్రశ్నోత్తరాల సమయంలో ఒక ప్రశ్నకు సమాధానంఇస్తూ విద్యాశాఖమంత్రి పార్లమెంటరీ కార్యదర్శి డాక్టరు మోహనదాస్ పై విషయాలు వెల్లడించారు. రఘునాథ్ సింగ్ అడిగిన ప్రశ్నకు సమాధానంఇస్తూ డాక్టరు మోహనదాస్ ఇంకా ఈ క్రింది వివరాలు వెల్లడించారు. "మొత్తం ఈ బుద్ధ జయంతి ఉత్సవాలకు 8 లక్షల 56 వేల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. ఇంకా సుమారు కోటిన్నర రూపాయలు కొత్త రోడ్లువెయ్యడానికీ, విశ్రాంతిగృహాల నిర్మాణానికీ, విద్యుద్దీపాలకు, మంచినీటి సరఫరాకు ఖర్చుచేస్తున్నారు."

డాక్టరు దాస్ ఈ సందర్భంలో అడిగిన కొన్ని అనుబంధ ప్రశ్నలకు సమాధానంఇస్తూ ఈ సందర్భంలో జరిపే సాంస్కృతికోత్సవాల కార్యక్రమం నిర్ణయించడంకూడా జరిగిందనీ, ఈ ఉత్సవాలలో బౌద్ధశిల్పప్రదర్శనం, బౌద్ధమత చర్చ, బౌద్ధగ్రంథప్రచురణ మొదలైనవి జరగగలవనీ అన్నారు.

'దలైలామాను ఈ ఉత్సవాలకు ఆహ్వానిస్తున్నారా' అని ఒకరడిగిన ప్రశ్నకు సమాధానంఇస్తూ ఈ విషయం తమకు తెలియదని డాక్టరు దాస్ సమాధానం చెప్పారు.

## దొంగ సిగరెట్ల వ్యాపారం

### అంతర్జాతీయ ముఠా పనిచేస్తున్నదట

బొంబాయి, సెప్టెంబరు 6: దొంగతనంగా దిగుమతి అయ్యే సరుకులు పట్టుకొనే శాఖవారు రీవేళ బొంబాయి రేవులో రహస్యంగా దిగుమతి అయ్యే 46 వేల సిగరెట్లు పట్టుకొన్నారు. వీటిలో చాలాభాగం ఇంగ్లండులోను, అమెరికాలోను, తయారయినసిగరెట్లు. దీనితో ఈ విధమైన రహస్య వ్యాపారం సాగించే ఒక అంతర్జాతీయ సంస్థ వ్యవహారాలన్నీ బయటపడిపోగలవని భావిస్తున్నారు.

రహస్యంగా ఒక పడవలో ఈ సిగరెట్లు తీసుకుపోతూంటే అధికారులీ పడవ పట్టుకున్నారు. ఈ పడవలో ఉన్న వారినికూడా వెంటనే నిర్బంధించారు. దిగుమతి అయ్యే సిగరెట్ల వెల 4 వేల 5 వందల రూపాయలు.

ఈ సిగరెట్లు దిగుమతి చేసిన ఓడను గురించీ ఈఅక్రమ వ్యాపారం సాగించే వర్తకులను గురించీ దర్యాప్తు సాగిస్తున్నారు.